





# నాటకాలు

భక్తి,జ్ఞాన,పురాణ,జానపద

# కుమార విజయము





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120000755

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో **భారత ప్రభుత్వపు** సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# కుమార విజయము

(కుమారస్వామి యుద్ధము)



విద్వాన్ బండ్ల సుబ్రహ్మణ్య కవి



పరమ శివభక్తి భావసంభరితుఁడైన
సుగుణి మాతండ్రి **వేంకట సుబ్బయార్యు**
నకు **కుమార విజయంబు** వినమ్రమతిని
**అంకితంబిత్తు** పితౄణ మపనయింప.

# పాత్రలు

దేవతలు

1. శంకరుఁడు.
2. విష్ణువు.
3. బ్రహ్మ.
4. కుమారస్వామి.
5. నారదుఁడు.
6. వీరబాహువు.
7. ఇంద్రుఁడు.
8. బృహస్పతి.
9. మన్మథుఁడు.
10. రతి.

రాక్షసులు

1. పద్మాసురుఁడు.
2. సింహవక్త్రుఁడు.
3. తారకుఁడు
4. శుక్రాచార్యులు (రాక్షస గురువు)
5. ధర్మగోప్తుఁడు.
6. భానుకోపుఁడు,
7. వాతాపి.
8. ఇల్వలుఁడు.

# విషయవిభాగము

* వటద్వీపమునకు నారదుని పయనము.
* పద్మాసురుని వీరయాగము.
* ఇంద్రుని పరాజయము.
* తారక విష్ణువుల యుద్ధము.
* సత్యలోకము – మన్మథ ప్రతిజ్ఞ.
* శివతపోభంగము.
* పద్మాసురుని పానశాల.
* జీర్ణం జీర్ణం వాతాపిజీర్ణమ్.
* పద్మాసుర పరాభవము.
* వీరబాహు రాయబారము.
* కుమారస్వామియుద్ధము.

# నాంది

శ్రీ రమ్యుండయి తారకాదిహరుఁడై సింహావలగ్నస్థుఁడై
హేరంబప్రముఖ ప్రతోషకరుఁడై హేలావిలాసోల్లస
ద్ధీరుండైన కుమారులీలలకు నెంతేమెచ్చి సానందులౌ
గౌరీశంకరులన్నుతించెద జగత్కల్యాణ సంసిద్ధికై

(నాంద్యంతమున ద్వితీయ సూత్రధార ప్రవేశము.)

సూ:- ఆహా! సకాలమున విచ్చేసిన సభాసదులందఱు ఎంత ప్రశాంతముగఁ గూర్చుండిరి. ప్రేయసీ! ఒక్కసారి యిటు రాఁగలవా?

నటి:- (ప్రవేశించుచు) వచ్చుచున్నదాన, ఏమిసెలవు?

సూ:- రంగారు రంగాలంకరణములతో రంగురంగులవిద్యుద్దీపములతో వివిధ భాషావిశారదులగు రసజ్ఞులతో మన నాటకశాలయంతయు నెంత కళకళలాడుచున్నదో చూచితివా? కళవలన ఆనందము పొందఁజాలని మానవుఁడు కలలోనైనఁ గనఁబడఁడేమో. ఇప్పుడేనాటకమును బ్రదర్శించి వీరికి సంతసము గలిగింప నెంచితివి?

నటి:- ఇప్పటివఱకు ప్రపంచమునందలి యేభాషయందైనను రచింపఁబడని రసవత్తర నాటకరాజమగు కు మా ర వి జ య ము ను. అడుగో దేవలోకమునుండి దేవర్షియగు నారదుఁడు గానకళాలోలుఁడై చనుదెంచుచున్నాఁడు. అనంతర కార్యక్రమమున కుపక్రమింతము రమ్ము.

[ ఇది స్థాపన ]






ఓమ్





# కుమార విజయము



(కుమారస్వామి యుద్ధము)

## ప్రథమాంకము

### ప్రథమ రంగము

(అగస్త్యాశ్రమ ప్రాంతము)

(ఆకాశమునుండి గానలోలుఁడై నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

నార:- సత్యలోకమున జననీజనకులగు సరస్వతీ బ్రహ్మలఁ బూజించి దీవనలు గడించి వియద్గంగా సైకతముల విహరించి భగవల్లీలా విలాస భాసుర గానకళాలోలుఁడనై వటద్వీపము చేరఁబోవుచున్నాను. (నలుదెసఁబరికించి) అహో! ఇది అగస్త్యాశ్రమము కాఁబోలు.

ఋషికుమారుఁడు:- (ప్రవేశించి) పూజ్యపాదులగు నారదమహర్షులకు అగస్త్యశిష్యుఁడు నమస్కరించుచున్నాఁడు.

నార:- జ్ఞానాభివృద్ధిరస్తు. మహామహులగు మీ గురువర్యుల తపోమహిమచే సహజ వైరముగల పశుపక్ష్యాదులు సైతము మైత్రిమై మెలఁగుచున్నవా? వినయమ్మున నీశిరమ్మువలె ఫలభారమ్మున నివ్వారి మొక్కల తలలు వంగునుగదా? ఆశ్రమవాసులెల్లరు సుఖంబుండిరా?

ఋషికుమారుఁడు:- భగవదాజ్ఞవలన - మఱియు భవదనుగ్రహము వలన. మాగురువర్యుల ప్రబోధమున ఈ ప్రాంతమున భగవద్భక్తి అతిశయించినది. దస్యులబాధ తగ్గినది.

నారః- అటులైన నిప్పుడీ ప్రాంతమునకు దాక్షిణ్యా మన్వర్థకాభి ధానము. విశ్వకల్యాణకారియై వింధ్యగర్వ మణంచిన కుంభ సంభవు లిప్పుడేమి చేయుచున్నారో?

ఋ.కుః-తపోదీక్షయందున్నారు.

నారః- అటులైన నంతరాయము గలిగింపరాదు. అదియునుంగాక పద్మాసురాదుల వీరయాగము విలోకింప వటద్వీపమునకు వేగ నేగవలయు. ఆజ్యధూమజాలము వర్షాశరన్మధ్య మేఘ మాలవోలె నాకసమున నలముకొనుచుండెనేమో! స్వాహా రవమ్ములతో ఆహారవమ్ములు పెనఁగొనుట అబ్బురము కాదు. అచ్చట హోమధూమము గుప్పు గుప్పున పైకి లేచినంతనే స్వర్గమున ఇంద్రునిసింహాసనము చప్పున నులికిపడి యుండ వచ్చు. సర్వేశ్వరుని సంకల్ప మూహాతీతము.

గీ॥ ఏ మహాశక్తి జగముల నెల్లనిండి
కర్మవశమునఁబ్రాణి చక్రమును ద్రిప్పు
ఆ మహాశక్తిధరునిచే ననవరతము
సాధు సజ్జనరక్షణ జరుగుఁగాఁత!

ఋ కుః-మహాత్ములవాక్య మవితథ మగుఁగాక! (అనుచు నారదునకు నమస్కరించుచుండ నారదుఁడు దీవించునట్లు హస్తసంజ్ఞచేసి గానలోలుఁడై నిష్క్రమించుచున్నాఁడు)

[ ఇది మొదటి తెఱముందు జరుగుచుండ లోపల వీరయాగమునకు వలయు దృశ్యమును జక్కఁజేసి కొనవలయును.]



## స్థలము - యజ్ఞవాటిక

[పీతాంబరధారులై శుక్రతారకులు యజ్ఞకుండము దగ్గఱగూర్చుండి వేల్చుచుందురు. కుండ మధ్యమునఁద్రిశూలము నాటఁబడి యుండును. యూపము పూజాద్రవ్యములు మొదలగునవి వానివాని స్థానముల నుండవలయును.]

శుక్రుఁడు:- ఓమ్ శివాయస్వాహా - శివాయ ఇదమ్ నమమ
ఓమ్ శంకరాయస్వాహా - శంకరాయ ఇదమ్ నమమ
ఓమ్ మృత్యుంజయాయస్వాహా - మృత్యుంజయాయ ఇదమ్ నమమ
ఓమ్ పరమేశ్వరాయస్వాహా - పరమేశ్వరాయ ఇదమ్ నమమ
ఓమ్ రుద్రాయస్వాహా - రుద్రాయ ఇదమ్ నమమ

తార:- ఆచార్యా! అచంచల దీక్షా దక్షులగు నా అగ్రజులు చూపిన మహాత్యాగమునకే మహేశ్వరుని మనసుకరఁగనిచో ఇంక నే నా శంకరుని కరుణ సంపాదింపఁగలనా? మాకొఱకు సర్వ శక్తుల వినియోగించి శ్రమపడుచున్నారు. ఈజన్మమున మీ ఋణము తీర్చుకొనఁజాలము. ఇట్లెంతకాలము మనము అవిచ్ఛిన్నముగ హోమము చేయఁగలము?

శుక్రు:-శివానుగ్రహము కలుగునంతవఱకు.

తార:- అది యసంభవమైనచో?

శుక్రు:-కాదు. సంభవమే

తార:- ఒకవేళ......

శుక్రు:-అట్లైన ప్రాణత్యాగము.

తార:- ఇది నాకు సరియైన యుపదేశము (లేచినిలిచి) శంకరా! భక్తవశంకరా!

మ॥ నినుసేవింపని పుట్టువేల? యని తండ్రీ! వీరయాగంబునన్
జనకుండున్ గురుఁడానతిచ్చినటు విశ్వాసంబుతోఁ గొల్వమే,
కనులున్నందులకున్ ఫలంబిపుడుగల్గన్ నీవు రాకున్నచో
నను నీలోకము చేర్చుకొమ్మిఁక జగన్నాథా! దయాసాగరా!

ఒక్కసారి మనసార శివుని ధ్యానించి యీ త్రిశూలముపై దూఁకెద. గురువర్యా! నీకిదే కడసారి నమస్కారము.
(అని ధ్యానించి దూఁకుటకు సిద్ధముగా నుండఁ దెఱలోనుండి తెల్లనివెలుఁగు జాడలు ప్రసరించుచుండును. తారకుఁడు ఆ ప్రకాశము నాశ్చర్యముతోఁ జూచుచుండును. శంకరుఁడు తెఱలోనుండి .....)
తారకా! ఆఁగుము ... ఆఁగుము.

చ॥ వలదిఁక దూఁక-మెచ్చితిని- వచ్చితి నిచ్చెదఁ గోరు కోరికల్
కలఁగకు- మజ్జటాపటలి గంగను బంపెద- నగ్నికుండముల్
జలమయమౌచు సోదరులు సత్వర లీల సజీవులై రసా
తలమున సౌఖ్యమందెదరు తథ్యము తథ్యము విశ్వసింపుమా!
(తెఱలోనుండి జలధారవచ్చి అగ్నికుండమును చల్లార్ప నందుండి పద్మాసురసింహవక్త్రులు వెలువడి తారకుని కలిసికొని జలధారవచ్చిన దిక్కుఁజూచుచు మోఁకాళ్ళమీఁద నిలువఁబడి నమస్కరించుచు)

పద్మా:- సింహా:- తార:- -:దండకము:-
శ్రీమన్మహాదేవ దివ్యప్రభావా శివా దేవదేవా
భవానీధవా భక్తసంరక్షకా కావఁగా వచ్చితే
మెచ్చితే విశ్వనాథా నమస్తే నమస్తే నమస్తే నమః.
(శంకరుఁడు ఒక్కొక్క అడుగు నెమ్మదిగా వేయుచుండ నీ దండకము చదువుచుండవలయును)

శంక:- ఆహా! ఏమి యీ మహాహావదీక్ష... ఏమి యీ మహాహావ దీక్ష. వీరరస విలాసమునకు మీ యీప్రదర్శనమే నిదర్శనము. అగ్నిపరీక్షకాఁగితిరి. కోర్కులు కొనసాగఁ గలవు. కోరుకొనుఁడు.

పద్మా:- సర్వేశ్వరా! సమస్తలోకముల జయించి ఏకచ్ఛత్రాధిపత్యముగ నేలునట్లును విష్ణుబ్రహ్మేంద్రాది దేవతలచేతను ...

క్షమింపుఁడు... మీచేతను ఇప్పటిసృష్టిలో దేనిచేతఁగాని—
మాకు చావుకలుగకుండునట్లు వరము ప్రసాదింపుఁడు.

శంక:- అట్లే యొసంగితి. నవరత్నఖచిత దివ్య విమానంబొకటి యిచ్చెద. ఈ యగ్నికుండమున రక్కసులుజనించి నీకు సైనికులయ్యెదరు. నేను గూడ మీకు వశ్యుండను. నాలోని శక్తి మాత్ర మసాధ్యము.

అందఱు:-మహాప్రసాదము. [తలలువంచియుండ శంకరుఁడదృశ్యుండగును]

పద్మా:- గురూ! ఇఁకఁగర్తవ్యము?

శుక్రు:- స్వర్గ మర్త్య పాతాళముల జయించుట. స్వర్గముపై మనకుఁ గల యధికారము స్వతస్సిద్ధము. "పూర్వదేవాః" అనుశబ్దమే మన జ్యేష్ఠత్వమునకు దృష్టాంతము. అదియునుంగాక రాజ్యము వీరభోజ్యము. అవిభాజ్యము.

పద్మా:- (తమ్ములంజూచి) మీ యభిప్రాయము?

సింహ:-గురూపదేశము శిరోధార్యము. మన విజయమునకే గదా మనజనని తపించుచున్నది. ఆ తల్లి యాశీర్వాద బలముతో నిర్వక్రపరాక్రమమున విజృంభించితిమేని యీరేడుజగంబులు తాఱుమాఱుకావే? ఝుంఝూమారుతమ్మునఁ దల్లడిల్లు పారావారమ్ము వగిది. ఘోరాపదలంజిక్కి పాదాక్రాంతమ్ములుకావే? ఇంతకు నేమాటయైన మీ నోట వెలువడినఁగాని జీవకళ యుండదు. శంఖమునఁబోసినఁగాని తీర్థముగాదు. కావున మీ యాజ్ఞ కెదురుచూచుచున్నారము.

తార:- అగ్రజా! నీ యడుగుజాడ ననుసరించుటకీ తారకుఁడు సిద్ధముగనున్నాఁడు

ఉ॥ సర్వసుఖాస్పదంబయిన స్వర్గము వారల తాతసొత్తుగాఁ
బూర్వమునుండి దేవతలుపొంది యహంకృతినొంది యేలుచున్
బూర్వసురాగ్రగణ్యులను బోటున దీటుగ మాటిమాటికిన్
సర్వముఁ బాపి చంపిరఁట శౌర్యరసమ్మిఁకఁ జూప జెల్లదే?

మీరు యుద్ధమునకు దిగినచో—

వం॥ చిటచిటలాడు నిప్పులను జిందెడి తూపుల నేపుమీఱఁగా
పుటపుటఁ జిమ్మి వైరులను బూదిగఁజేసెద నట్లుకానిచో
పటపట పండ్లుగీటుచును బాహుబలంబునఁ బట్టిచీల్చెదన్
గుటగుటలాడి శాత్రవులు గుట్టలుగా ధరఁ గూలునట్లుగా.

శుక్ర:- [ఆనందమున నవ్వి] అన్నకుఁదగిన తమ్ములు. ఇక దేవతల మట్టువెట్టి నట్టడవులకుఁ బాఱఁద్రోలి వారిపట్టణముల పట్టుదలతోడఁ బాలించి శుక్రశిష్యులు శూరులనఁగ నొప్పుటయే మీ కర్తవ్యము. అంతవఱకు శాంతిగాని విశ్రాంతిగాని యుండఁదగదు.

పద్మా:- సోదరులారా! వినుఁడు. హరుని వరబలము చేతను— గురుని మంత్రబలముచేతను— మీ మనోబలము చేతను— సేనల శరీరబలము చేతను—

సీ॥ హరిని బంధించి స్వర్లోక మాక్రమించి
మర్త్య పాతాళ నాయక మణులఁ ద్రెంచి
సురల నడవికిఁ దోలించి హరుభజించి
ధరణిఁ బాలింతు నాచంద్ర తారకముగ.

శుక్రు:- తథాస్తు. తథాస్తు. పద్మాసురా! ఏనుఁగులపై దుముకఁ దమకించు సింహములవలె నీ యండనున్న దండిమగలు దేవతలపై కరుగ సిద్ధపడియుండిరి. తమ కఱకుకత్తుల కెప్పుడు పనిగల్గునా యని మాటిమాటికి నొఱనుండితీసి చూచుకొనుచుండిరి. మన యోధులు శీతాకాలపుఁ గుంపట్లవంటివారు సుమా! వారి భీకరసంగ్రామ సాహసకృత్యములు సర్వసంవేద్యములు. అందఱు విచ్చు కత్తులవంటి జోదులే. చిచ్చఱపిడుగులనుచేపట్టి విచ్చలవిడి యార్చివైచు నేర్పరులే. కుచ్చితమెఱుఁగని స్వామిభక్తిగల సచ్చరిత్రులే. ఇక మీరన్ననో నిజభుజార్గళ సంశోభిత గదాదండాగ్రమున సంగ్రామవిజయలక్ష్మిని దాండవమాడింపఁగల వరపుత్రులరు.

పద్మా:-సింహ:-తార:- (తలలువంచి నమస్కరించు) కృతజ్ఞులము.

[శుక్రుఁడు విజయోస్తు అనుచు నిష్క్రమించును]

పద్మా:- (లోనికిఁజూచి) యోధాగ్రేసరులారా!

చ॥ బ్రతికిన నాల్గునాళ్ళు నిజపౌరుషకేళిఁ జరింపలేనిచో
బ్రతుకఁగనేల నేలకొక భారముగా జగమెల్ల రోయఁగా;
నతులిత శౌర్యసాహస మహాహవదీక్షవహించి నేనిఁక౯
గుతుకముతోడ దేవతలఁ గూఁకటివేరునుద్రెంప కుందునే?

ఈ సర్వదిగ్జైత్ర యాత్రాసందర్భమున మీ సంపూర్ణ సాహాయ్యమును గోరుచున్నాను. సంగ్రామ సాధన సన్నాహాముతో శీఘ్రముగా శిబిరములకు రండు. సోదరులారా! వెనుకు ముందంజవేయుఁడు.

సింహా:-తార:- చిత్తము. (నిష్క్రమించుచున్నారు)

(గానలోలుఁడై నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు)

పద్మా:- గానకళావిశారదా! నారదా! వందనములు.

నార:- శుభంభవతు. (మోముఁజూచి) దీర్ఘాలోచన పరుఁడవైనట్లు తోఁచెడిని, కారణమరయవచ్చునా?

పద్మా:- కారణము (వెగటుగనవ్వి) మా రణము...మారణము.

సీ॥ వీరహోమముచేసి వీరుండనై యీశు
మెప్పించి మితిమించి మెఱసినాఁడ
రణరంగ దుర్భేద్య రమ్యాస్త్ర కవచముల్
నందివాహను దయఁ బొందినాఁడ
బ్రహ్మాండముల మహాప్రతిభతోఁ బాలించు
పాలకులను బాఱఁదోలువాఁడ
ఈరేడులోకాల కేలికనై మించి
యెనురుకత్తియలేక యేలువాఁడ

గీ॥ రాక్షసాన్వయ విజయ సామ్రాజ్యకీర్తి
సర్వ దిగ్దంతి దంత విశ్రాంతి నొంద
చూచి తలయూచి మురు వేల్పువైచుకొనవె?
మహితగుణసాంద్ర! నారదమౌనిచంద్ర!

నార:- (జనాంతికముగ) దేవద్వేషము పరంపరాగతము. ఆవుచేనిగో మేయ దూడ గట్టున మేయునా? ఇప్పు డీతని కోపాగ్నికి వాయుదేవుడ నయ్యెద. "ఖగాణానిఖనన్యాయము" గ బరీక్షించెద. ఆవల హితోపదేశము గావించెద. (సమీపించి తల యూపి నవ్వుచు) ఔరా! యెంతటి ప్రయత్నము! ఇంద్రాదులకు సర్వ సహాయుడై విష్ణువుండునని తెలియునా?

పద్మా:- తెలియుటకేమి? తానుదూర సందులేదు డోలొకటి మెడకు. ఇక దేవతలు విష్ణువును నమ్ముకొని కుంటిచానిపై గ్రుడ్డివాడెక్కెటట.

నార:- శ్రీ మహావిష్ణువుశక్తి నీవు పూర్తిగా గ్రహింపలేదు. దేవతలపై అక్కటికమ్మున పెక్కవతారములెత్తి రక్కసుల యుక్కడంచిన దైత్యారినా తేఱుమఁజూచుట? మత్స్యావతారమ్మున సోమకుని మట్టువెట్టి, కూర్మావతారంబున మంధరగిరి కవ్వంబుగ మోసి, జగన్మోహినియై ఋషులకు సుధ నిడిన పుండరీకాక్షునా నీవు దండించుట. అసాధ్యము... అసాధ్యము... అదియునుంగాక తక్కిన దైవబలముమాత్రము సామాన్యమా?

సీ॥ శాపమాత్రమ్మున శత్రుల సాధించు
దివ్యతేజుడు బ్రహ్మదేవుడుండ
వజ్రాయుధమ్ముచే బర్వత పక్షముల్
నఱికివైచెడి సురనాథుడుండ
అఖిలాస్త్రశస్త్రజాలాగ్జ నాహవశక్తి
వరలు దిక్పాలక వర్గముండ
గంధర్వ కిన్నర గరుడ విద్యాధరు
లాజి రాజితతేజు లలరుచుండ

గీ॥ అమృతపానమ్ముచే జావు నధిగమించి
బలము కలిమిని గులుకు దేవతలు నుండ
గడు నసాధ్యమ్ము- జయమందగలవో లేవో
నమ్మకము నాకు లేదు దానవ కులేంద్ర!

పద్మా:- (నవ్వి) నారదా! శ్రమపడి దీర్ఘోపన్యాస మిచ్చినాఁడవు. ఇంతమాత్రమునకే భయపడువాఁడు కాఁడీ పద్మాసురుఁడు. నిండుకుండ తొనకదు —సరిగా పడిన కాలు బెనకదు. పెద్ద వాఁడవనఁగూడదుగాని గడపగడప పూజచేయుటచే నీకును అప్పుడప్పుడు మతి మాఱుచుండునేమో.

నార:- నవగ్రహముల గతులుమారినను నామతి మారదు. నాకొకరు మిత్రులు- ఒకరు శత్రువులా! ఒకరినిగుఱించి యెక్కువగా మరియొకరిని గుఱించి తక్కువగాఁ జెప్పవలసిన యవసరము నాకెప్పుడును గలుగదు ఉన్నవిషయ మొగ్గడించుటలో నిగ్గు దేలినవాఁడను. నీ మేలుగోరి నేనాడిన మాటలలోని తార తమ్యము తెలిచిచూడుము. అదేమి చిత్రమోగాని కన్ను దెఱచినది మొదలు రాక్షసవీరులకు స్వర్గముమీఁదనే చూపు.

పద్మా:- హక్కుగలవారి కా దృష్టి సహజమేగదా!

నార:- ఔను. హక్కును గుర్తించినపుడు బాధ్యతనుగూడ గమనింప వలయును. అంతియేగాని, నీ శౌర్య ధైర్య స్థైర్యముల నెఱుం గని వాఁడనుగాను. తాడి నెక్కువారి తల తన్నువాడుండును. నీవంటి మహాపరాక్రమశాలి మీావంశమున నిప్పటికిఁ బుట్ట లేదనుట యతిశయోక్తిగాదు. కాని, ఇంతవఱకు శ్రీ మహా విష్ణువును జయించినవాఁడును లేఁడు.

పద్మా:- ఆ ...... అట్లు దారికిరమ్ము. ఆ కొఱఁత దీర్చుటకే మేము జన్మించినవారమని నమ్ము.

మ॥ పని లేనంతనఁ దుప్పపట్టిన గదా పాణిప్యా మిప్పుడునన్
బునరుద్భాసితమై చెలంగఁ గలఁగున్ బోరాటమారాటమై
యినకోటిప్రభతో వెలుంగ శని నే నేకాదశస్థానమం
దొనఁగూర్తున్ భళి! ముజ్జగంబులను నే నుజ్జ్వాతలూఁగింపనే.

నార:- పద్మాసురా! యుద్ధము సర్వానర్థములకు మూలము. చెల రేఁగిన దవాగ్ని ముండ్లచెట్లనే గాదు; పండ్లచెట్లనుగూడఁ

గాల్చి వేయును. కనికరములేని హృదయము నీరు, కొబ్బరలేని నారికేళము. నీకున్న రాక్షసరాజ్యముతో తృప్తినొందలేవా?

పద్మా:- అది వీరధర్మముగాదు. నీ విట్లాడుట గిల్లి జోలవాడుట.

నార:- నా సదుపదేశము బధిరశంఖన్యాయమైనది. విడువుమన్న పామునకు, కఱవుమన్న కప్పకు కోపము. కానున్నది కాక మానదు. మంచిది నేనికఁబోయివచ్చెద.

[చెరియొకదెసకు నిష్క్రమింతురు]






ఓమ్





# కుమారవిజయము

(కుమారస్వామి యుద్ధము)



## ద్వితీయాంకము

[ఇంద్రుఁడు—బృహస్పతి ప్రవేశించుచున్నారు]

ఇంద్రు:-ఆర్యా! ఈ స్వర్గసింహాసనాధికారమున నేను మహాభోగము లనుభవించుచున్నట్లు, ఇతరులకుఁ గనఁబడుటయేగాని, నాకు మాత్రమిది మోయరాని భారముగా నున్నది. నూఱుయజ్ఞములుచేసి పొందిన భాగ్యమిది.

బృహ:-ఔనౌను. కష్టసుఖములు కావడికుండలు. ఎంత దివ్వెక్రింద అంత చీఁకటియుంట నైజము. కావడిబరువు మోయువానికిఁ దెలియుఁగాని చూచువారికిఁ దెలియునా? ఇప్పుడీవిచారమేల?

ఇంద్రు:-నా యెడమ కన్నదరుచున్నది. స్వర్గపుర రాజ్యలక్ష్మి కళాహీనమైనట్లు నా మనస్సునకుఁ దోఁచుచున్నది.

బృహ:-రాఁబోవు కష్టసుఖముల సూచించు ప్రకృతిచిహ్నములను జ్ఞానవంతులు గ్రహింతురుగదా. నా యంతరాత్మయు నేదో కీడును శంకించుచున్నది ఏ మూల ఏ రాక్షసులేమిచేయు చున్నారో.

ఇంద్రు:-మనము పంపిన గూఢచారులు ఇన్నిదినములకైనను దిరిగి రాఁజాలకపోయిరి. ఎవరిచేనైన బంధింపఁబడిరా? నేఁటిసభకు దిక్పాలకు లొక్కరును రారు విమానసంచారమా; లేదు? కటా! ఏమికారణము?

బృహ:-నిర్విచారులైన సర్వసుపర్వులను గర్వంబునఁ జెఱుపఁజూచు వారు రాతిరించరులేగదా!

[గానలోలుఁడై నారదుఁడు ప్రవేశము]

ఇంద్రు:-[నమస్కరించి] ఈ పీఠ మలంకరింపుఁడు.

నార:- (కూర్చుండును)

బృహ:-ఊరకరారు మహాత్ములు—

నార:- ఏమి మహాత్ములో... కఠినాత్ముల చేతిలోనుండి బయటబడి నప్పుడుగదా మహాత్ముల గొప్పఁదనము. ఒకప్పుడు మహాత్ము లూరక రావచ్చునుగాని దురాత్ములెప్పుడును నూరకరారు.

బృహ:-(ఇంద్రుని జూచి) వశ్యవాక్కులుగల యీ దేవర్షి నోట నర్థ శూన్యముగ నిట్టిమాటలు వెలువడవు. అనవసరముగఁ బ్రకృతిమాత ఋతుధర్మమును వ్యత్యస్తముగఁ బ్రదర్శించునా?

ఇంద్రు:-కార్య కారణ సందర్భమును సూచించుచున్న మీ మాటల లోని రహస్యమును దెలిసికొన నామనస్సు తొందర పడుచున్నది.

బృహ:-నాకును నట్లేయున్నది. తెఱచాటున గానము సేయుచున్న వేషధారిని చూచుటకుఁ బ్రేక్షకులు తహతహపడుట సహజముగదా!

నార:- మేఘవాహనా!

గీ॥ ఓడ యొకప్రక్క మునుఁగుచునున్న వేళ
సందు ముఖ్యులు వెలివార్త లడిగినట్లు
పలికవు దేవలోకార్తి నెఱుఁగకైతి
వేయికనులున్న గ్రుడ్డివి వేయునేల?

బృహ:-నారదా! దేవనాథుని దేశభక్తిని — వజ్రాయుధశక్తిని శంకించుచుంటివా?

నార:- నేనుగాదు; జగమంతయు— వినుఁడు. అసురేంద్రునకు మంగళకేశియందు సురస యను కూఁతురు పుట్టి శుక్రునివలన మాయావిద్య లభ్యసించి మాయ యనుపేరుపొందె. ఆమె

మాయా సౌందర్య మాధురీమహిమచే కశ్యపునాకర్షించి వాని వలనఁ బద్మాసుర సింహవక్త్ర తారకులను మువ్వురుపుత్రులం గనె. పూర్వము బ్రహ్మసేయు యాగమున నందీశ్వరుఁడు దేవతల సంపదలు చెడునట్లు శాపమిచ్చినసంగతి శుక్రుఁడు గుర్తుంచుకొని యా శాపము నెఱవేర్పఁగల సమర్థులు వీరని గ్రహించి వీరయాగము చేయించె అందు హరుఁడస్త్ర శస్త్రములతో నడిగిన వరము లనుగ్రహించినాఁడు. సహజబలము నకు వరబలము తోడ్పడుటచే వారిశక్తి నెంతని వర్ణింతును!

ఇంద్రు:-తన కపకారము సేయఁదలంచిన భస్మాసురునకు సైతము కోరిన వరమిచ్చిన మహాదేవుఁడు వీరికీయకుండునా? అయుగని వానిదే పాపము.

బృహ:-వృత్రాసుర- బలాసుర- జంభాసురాదుల మించినవారా?

నార:- వీరికి వారికిఁగల భేదము హస్తిమశకాంతరము.

ఇంద్రు:-తరువాత?

నార:- తరువాత—

మ॥ అసమాన ప్రతిభా విశేషమహిమాహంకారతఁ జూరుఁ దా
కసముంజీల్చు భయంకరధ్వనులతోఁ గాలాంతకుండో యనన్
వెస నిర్వక్రపరాక్రమక్రమ జితానేకారి వీరేంద్ర సై
న్య సమేతుండయి దండయాత్ర వెడలెం దమ్ముల్ విజృంభింపఁగా.

వెడలి యలకాపురికేగి రూక్షేక్షణంబున యక్షరాజును భిక్షుకునిజేసి - గంధవతికరిగి గంధవహుని గర్వమడఁచి— శ్రద్ధావతికేఁజని వరుణుని శిబిరము వంగఁజేసి—కృష్ణాంగనకుఁ బోయి నైఋతిని గతిలేనివానిగా నొనర్చి— పితృపతిని భీకరముగనొంచి - అగ్ని తేజమణఁచి— స్వర్గపురికి రా సమకట్టి యుండె.

ఇంద్రు:-(ధైర్యము తెచ్చుకొని) అటులైన సర్వ సైన్యసమేతుండనై పుర ప్రాంగణమున నిల్చి సంగ్రామమొనర్చి గెల్చెద.

మ॥ అతి శీఘ్రమ్ముగ దైత్య దానవ బలాహంకార శంఖారవో
ద్ధతులెల్లం దలక్రిందులై తొలఁగ మద్వజ్రాయుధాంచత్ప్రభా
వితతింజూపెద రూపుమాపెద మహా వీరాధివీరుల్ సమి
ద్గతులంగాంచి ప్రశంససేయఁగ జగత్కల్యాణ మేపారఁగా.

నార:- కట్టివేయుమయ్యా దేవనాథా! గుఱ్ఱమును కట్టివేయుము. అలవిగానిచోట అధికులమనరాదు. ఆపనికి అనుకాదని చెప్పుటకే నేనింతదూరము వచ్చితిని. సాహసించినను ఫలముదక్కదు. సమయమును గమనించి నీవణఁగిమణఁగి యుండుట మంచిది. ఆపైని యుక్తిచే తప్పించుకొనుట మఱియు మంచిది.

గీ॥ నలిగియున్నట్టివేళల తొలఁగియుంట
కరము మేలని బుధులు పల్కఁగ వినమె?
బలము లేనట్టితఱి మబ్బు పవనహతికి
తొలఁగిపోవదె తగుతోడు దొఱకువఱకు.

బృహ:- ఔను. గ్రహరాజునైతము సమయము తప్పినపుడు తలయుఁ దోఁకయులేని గ్రహములచే బాధపడును గదా!

గీ॥ పెద్దయలవచ్చినప్పుడు వినయగరిమ
శిరము వంచినఁ పైఁజని విఱిగిపోవు
వానగాలితాఁకుడు వనస్పతికెగాక
వంగిపోయిన తుంగకేభంగమొదవు.

ఇంద్రుడు:- మునికులతిలకా! ఈకష్టవార్ధినుండి యుద్ధరింప మీరేసమర్థులు.

నార:- దేవేంద్రా! పర దురహంకార పూరితులైన యీదైత్యులను దాఁక మృత్యుంజయునకైనఁ దరముగాదన్న నీకింకేదిదారి? పాదపూజ గావించుటయే పరమకర్తవ్యము.

ఇంద్రుడు:- ఎవనికి?

నార:- తాత్కాలికముగ ... దానవరాజునకు.

ఇంద్రుడు:- ఆపైని మాకురక్షణగలదా?

నార:— లేకేమి?

సీ॥ శ్రీదేవి యురమునఁ జెన్నారు కస్తూరి
కోరి యెవ్వనిఱొమ్ము చేరుమందు
పవను భక్షణచేసి బ్రతుకుచుండెడి శేషు
పాన్పుగా నెవ్వఁడు పవ్వళించు
శత్రుసంహారణాకై శంఖ చక్రాదులు
చెలఁగు నెవ్వని నాల్గుచేతులందు
విశ్వంభరాభార విదళనాయత్తుడై
యవతారముల నెవ్వఁడమరుచుఁడు

గీ॥ యుక్తిచేఁ గార్యసాఫల్యయుక్తుఁ డెవ్వఁ
డసురమృగముల పాలి సింహంబెవండు
దీనరక్షణకంకణ ధీరుఁడెవ్వఁ
డట్టి విష్ణువె రక్షకుఁడమరనాథ!

ఒకవేళ నా శ్రీహరికిదాఁటిపోయినచో శ్రీకంఠుఁడున్నాఁడుగదా!

బృహ:—ఇది మొదటినుండియు వచ్చుచున్న యాచారమే.

ఇంద్రుడు:—ఆచారమో గ్రహచారమో చివఱకు నావిచారమునకు మేరలేదు.

బృహ:—పాకశాసనా! క్షత్రియోచితమైన ధైర్యమేలకోల్పోయెదవు? మనల రక్షింప నొకప్రక్క మహావిష్ణువు మఱొకప్రక్క మహేశ్వరుఁడు సిద్ధముగానుందురు. అంధకాసుర త్రిపురాసుర గజాసురాదులఁ ద్రిలోచనుఁడు సంహరించినది మనమేలు కొఱకేగదా!

నార:— కాని, ఇప్పుడొక్క సందేహము.

గీ॥ మున్ను దక్షప్రజాపతి జన్నమునకు
శివునిబిలువక దూషణ సేయునపుడు
కాదుకాదని పలుకని కారణమునఁ
గలుగనున్నట్టి కష్టముల్ తొలఁగఁగలవ?

ఇంద్రుడు:- దేవతల యనర్థకములు- రాక్షసుల బలవర్ధకములు.

నార:- శిశిరఋతువున ఆకురాలినను వృక్షమునకు వసంతమునం జిగురు పట్టకుండునా? ధైర్యమూనుము. మహామేధావియగు బృహస్పతితో యోచించి వలయురీతినివర్తింపుము. నేంబోయి వచ్చెద (గానలోలుండై నిష్క్రమించుచున్నాండు)

ఇంద్రుడు:-గురూ! ఇపుడేది కర్తవ్యము?

బృహ:-సత్యలోకమునకరిగి బ్రహ్మనుప్రార్థించి వీరి మరణోపాయము తెలిసికొనుట మనకర్తవ్యము.

[తెఱలోం గలకలము]

సేవకుడు:- (రక్తసిక్తాంగుండై ప్రవేశించి) సురేశ్వరా! రక్షింపుము. రక్షింపుము. పద్మాసురాదులు సైన్యసమేతులై హాఠాత్తుగ వచ్చి పైంబడ నగర సింహద్వారదుర్గరక్షకులు మహాదీక్షతోం బోరుచున్నారు. మనబలముచాలదు. మీ యాజ్ఞకొఱకు నన్నంపినారు.

బృహ:-ఇంద్రా! అంతఃపుర రక్షణము.

ఇంద్రుడు:-సేవకా! జయంతుని తోడ్కొనిరాంగలవా?

బృహ:-(ఆతురతతో) వలదు. ఇది సమయముగాదు ఆలసించిన నన్నియుం గష్టములే నెమిలికంటనీరుగాఱ వేటకానికిముద్దా?

ఇంద్రుడు:-భార్యాపుత్రుల విచారించుటకైనను వ్యవధిలేదు... ..... ఆచార్యా! అటులైన మీరు కుటుంబసమేతులరై, యంతఃపుర స్త్రీలను జయంతుని దోడ్కొనిపోయి మేరుపర్వతమున నుండుండు. సమయమునుగమనించి మిమ్ము గలిసికొనంగలను. సేవకా! ఆచార్యాదుల సాంగనంపి మఱియొకసారియిటురమ్ము.

సేవ:- చిత్తము.

బృహ:-కష్టములందు ధైర్యమువహించుటయే మహాపురుషుల లక్షణము. విషమును విషముచేతనే యణంచవలయును. జాగరూకతతో వర్తింపుము. సేవకా! రమ్ము.

(నిష్క్రమించుచున్నారు)

ఇంద్రుడు:-(విచారముతో) ప్రేయసీ! శచీ!!

సీ॥ చింతామణీ భద్ర సింహాసనమున నీ
తోడఁ జేరుట నేఁటితోడ సరియె
మన కుమారుని మంచిమాట లాలించి ము
ద్దాడు భాగ్యము నేఁటితోడ సరియె
చని నందనమునకు చౌదంతిపై నెక్కి
ఆడు పుణ్యము నేఁటితోడ సరియె
కల్పవృక్షపునీడ కామధేనువుజాడ
కూడియుండుట నేఁటితోడ సరియె

గీ॥ వేల్పు వెలయాండ్రు నిచ్చలు వేడ్కతోడ
పాడి యాడెడు సభ నేఁటితోడసరియె
దైవమా! ఎట్టి క్రౌర్యంబు దలఁచితివి
బ్రతికి చెడుమంచు నుదుటను వ్రాసితకట!

సేన:- (ప్రవేశించి) దేవా! రాక్షసులతోడి యుద్ధమనఁగనే యువరాజు తోఁకత్రొక్కిన త్రాఁచువలె లేచినాఁడు. ఆచార్యుల వారు తగినరీతిని బోధింప శాంతించినాఁడు. మీరు చెప్పినట్లు అందఱు రహస్యమార్గమున విమానములో వెళ్ళఁగనే రాక్షసులు సింహద్వారమును భేదించి లోనికిఁబ్రవేశించి పట్టాం బెల్లఁ గొల్లగొట్టుచు - ఎదురువచ్చినవారిని జీల్చుచు కడుం గడు భీకరాకారులై వచ్చుచున్నారు. దేవర కర్తవ్యంబు యోచింపందగు. (నమస్కరించి నిష్క్రమించును)

**తెఱలో**

భటులు:-రాక్షసరాజా! దేవతలు పాఱిపోవుచున్నారు.

పద్మా:- బంధింపుఁడు బంధింపుఁడు. ఓరీ! దితిసుత సైన్యమ!

చ॥ నిలునిలు పాఱిపోకుముర! నిర్జరనాథ! నిశాటనాథుఁడే
తలపడె నింక నెచ్చటికిఁ దాఁటెదు మత్కరఖడ్గ భృత్ప్రభా
నలఘనకీలజాలమున నాకులు గీకులు చీకులైరి నీ
తల తఱుగంగవచ్చితిని తథ్యమ ఈ సురపీతి పీడుమా!

[నాల్గవచరణము చదువుచు సోదరసమేతుండై పద్మాసురుఁడు ప్రవేశింప]

ఇంద్రుః-దయచేయుఁడు (ఆసనముఁజూపును)

పద్మా:- (విసపు నవ్వునవ్వి) దయచేయుఁడు—అతివినయము ధూర్త లక్షణము. ఎంత చల్లనిచూపు!...వానలుగురిసిన వాఁతలు పోవునా? ఇందా్రి!

ఉ॥ ఉక్కఁరియున్న రక్కసుల ఉక్కునచిక్కులఁ జిక్కఁజేయుచుఁ
వ్రిక్కలుచేసినాఁడవట వారక దిక్కులకేగు గట్టులన్
తెక్కలు చెక్కినాఁడవట తేఁడ! పవింగొని వెన్నుచూపకే
నిక్కపు శౌర్యమున్నయెడ నీవ రణంబుననిల్చి గెల్వుమా!

[పద్యాంతమున నిందు్రినిచేయిపట్టుకొని ముందుకులాగును]

ఇంద్రుః-(వినయముతో) దానవ సార్వభౌమా! మీ సింహగర్జనమునకు బ్రిహ్మాండభాండములు బ్రిద్దలగుచున్నవి. మీ శౌర్యరసవాహిని కడ్డుదగిలి మరల్పఁగల మహాపర్వతమనా నేను? కాదు ... కాదు......మీ యాజ్ఞకు లోఁబడి స్వర్గమును పాలింప నాకనుజ్ఞనిండు. కాశ్యపులమగు మన మన్నదమ్ములము గదా!

పద్మా:- అన్నదమ్ములమా? ... [నవ్వి] అన్నదమ్ములము! అయిన మనసంబంధము రక్తసంబంధమా? (వికటముగనవ్వి) సెబాస్! అదియే మనకుఁ గావలసినది. అట్లైన "జ్ఞాతిశ్ఛేదనలేనకి" మ్మనెడిమాట మనలో నెవరు సార్థకముచేసిరి (తమ్ములవంక చూచి) అన్నదమ్ములము. పొత్తులు కలుపుకొను తొత్తుల జిత్తులు—నక్కజిత్తులు—ఇందు అన్నలెవరు? తమ్ములెవరు? మాలో మేమా? మనలో మనమా? ఇంత సన్నిహితసంబంధమింతకుముందేమైనది? మీ అహంకారాగ్నిలో దగ్ధమైనదా? ... అగుఁగాక! ఒకయొఱలో రెండుకత్తులిముడవు. అందిన జుట్టు...అందకున్నఁ గాళ్ళు. నీచలక్షణము! నల్లనివెల్ల నీళ్ళు తెల్లనివెల్ల పాలని విశ్వసించెడి మా రాక్షసుల నెన్నిసారులు మా యోపాయముచే నాశనముచేసినది మా గురువులు మాకుఁ జెప్పియేయున్నారు.

[సాభిపా్రియముగ సింహవక్త్రిని జూచును]

సింహ:- చెప్పుటగాదు ... నూఱిపోసినారు. అందువలననే మిమ్ము నేలఁబెట్టి కాలరాయవలయునని సంకల్పించితిమి.

[తారకునివంకఁ జూచును]

తార:- అనల్పమగు నీ సంకల్పమునకుఁ గల్పాంతమైనను వికల్పము జరుగదు. వీనికింకను స్వర్గసింహాసనముపై నాశ యున్నది. అందుల కన్నగారి యాజ్ఞ కావలెనట.

సింహ:- ఏనదియాజ్ఞ— యుద్ధమునకు— ఇంద్రా! ఇఁక నీ టక్కరి కూఁత లొకప్రక్కనత్రొక్కి మా మువ్వురలో నొక్కని కోరుకొనుము. తక్కిన యిరువురము దూరముగానిల్చెదము. వినోదమునకైనను బోరాడుము. నీ వజ్రాయుధశక్తి కొంచెము పరీక్షింపవలయునని మా కుతూహలము. మున్ను పాకాసుర వృత్రాసుర బలాసురాదులను సంహరించినది యీ వజ్రా యుధమేగదా? ఏది, ఒక్కసారి మెఱిపింపుము. మించులమించు నూఱించులఁ గాంచెదము. సంతసించెదము.

పద్మా:- ఆపైని నీసాహసమునకుఁ గనికరించి బహూకరించెదము.

ఇంద్రు:- పగటివేళ కళతగ్గిన చంద్రరేఖవలె నా వజ్రాయుధము నిస్తేజ మైనది.

ఉ॥ ఎంతటివాఁడ ఘోరసమరేచ్ఛనునిల్వఁగ దైత్యచంద్రమా!
పంతమువీడి లోకముల పాలనసేయ పరాక్రమించు మి
మ్మింతట నంతటన్ గెలుతుమే వరశక్తియుఁ దోడుబల్కు సు
స్వాంతముతో హితుండనయి స్వర్గమునేలెద మీ యనుజ్ఞచే.

నాకొక్క మన్నింతురేని యైరావతము నొసంగెద. ఉచ్చైశ్శ్రవము నిచ్చెద. కుబేరునిచే పుష్పకవిమానమిప్పించెద. రత్నరాజంబులొసంగెద, అనుగ్రహింపుఁడు.

పద్మా:- చాలుచాలు. దాతవు— లంచములిచ్చుటకు. నీ విచ్చుదాఁక— ఇప్పించుదాఁక పడియుండు పందగాఁడీ పద్మాసురుఁడు. అవి నా కనుసైగచే స్వాధీనములైనవి. ఇప్పుడు మాకుఁగావలసినది యుద్ధము.

చ॥ వినయముఁజూపెదేల? కనువిందుగ నీ కదనమ్ము విందుగాఁ
గొనఁ జనుదెంచ నద్ది దృగగోచరమైన నినుంద్యజింతుమే
కనుమిఁక మంత్రరుద్ధ భుజగంబువలెన్ నినుఁ జేయకుందుమే
దినదినగండ మెట్లుకడతేఱునురా యని యేడ్వకుందువే!

సింహా:- అగ్రజా! యీ పిఱికిపంద యుద్ధకుశలుఁడుఁ కాడే — మఱిదేని యందుఁ గుశలుఁడు?

పద్మా:- కష్టముగలిగినప్పుడు కనఁబడ్డవారి కాళ్ళుపట్టుకొని తప్పించుకొనుటలో అతి కుశలుఁడు. పగతుఱ గుట్టెఱుంగుటలో నిజముగా అనిమిషుఁడు.

సింహా:- పాపము! బెబ్బులులనడుమ జిక్కిన జింకపిల్లవలె నున్నాఁడు. పట్టణము వెలువలికి మెడఁబట్టి నెట్టుదునా?

పద్మా:- వలదు. ఈ స్వర్గ రహస్యములు వీనిపలనఁ దెలిసికొనవలెను. ఇంద్రా! అప్సరసలెక్కడ?

ఇంద్రు:- వారెవ్వరు నాసభకురాలేదు. ఏమైరో వారిసంగతియే నాకుఁ దెలియదు.

పద్మా:- తెలియదా? నిన్నుఁగూడఁ దక్కిన దిక్పాలకులతోఁ బాటు బంధించియుంచినఁగాని తెలిపెదు.

తార:- ఎవఁడురా అక్కడ?

సేవ:- (ప్రవేశించి) ప్రభూ! ఏమిసెలవు?

పద్మా:- బ్రతికిచెడ్డ- వీనిని బంగారపుసంకెళ్ళచే బంధింపుము.

సేవ:- చిత్తము. [లోనికేగును]

సింహా:- మంచిది. మనయెడ నిది మంచితనమును — వీనియెడఁ బోయిన రాజ్యగౌరవమును సూచించును.

ఇంద్రు:- ఆహా! నిగ్రహానుగ్రహ సమర్థులు మీరుగాక మఱెవ్వరు?

తార:- ముమ్మాటికి......మూఁడులోకముల. ఇఁక నోరెత్తెదవేని గదతో మొత్తెద.

సేవ:- (ప్రవేశించి బంగారుసంకెళ్ళతో నింద్రుని గట్టివేయుచున్నాఁడు)

ఇంద్రు!- రాక్షసరాజులు మా మాటలనుండి విపరీతార్థములు గ్రహించుట మా దురదృష్టము.

పద్మా:- అతిశూర- అగ్నిముఖ- ఆశివక్త్రి- వజ్రిబాహ్వాది సురారులారా! మీరు నైమిశారణ్య బదరికావన దండకాటవులంజేరి ఋషులంజేరి యజ్ఞ హవిర్భాగములఁ బద్మాసురునకుఁ, దత్సోదరులకు నర్పింపుఁడని నామాటగా శాసింపుఁడు. కాదన్నవారిని మీ యిచ్ఛవచ్చినట్లు గావింపుఁడు. పొండు. [తారకుని జూచి] సోదరా!

శా॥ వైకుంఠంబున కేగి పట్టణము విధ్వంసంబుఁ గావించి త
త్వైకుంఠాధిపు భక్తులం దునిమి భాస్వచ్ఛోభతో శ్రీహరిన్
వీఁకన్ దాఁకి కలంచి మించి ఘన దోర్వీర్యంబు చాటింపుమా
నాకుం దమ్ముఁడనంగ నొప్పెదవు సన్మానంబునం దారకా!

తార:- కృతార్థుఁడను. అగ్రజా! నీయాజ్ఞ నాకు నూతనోత్సాహము గలిగించినది. నా గదాఘాతమున లోకములు చీకాకుపడవే. హరి గిరి లెక్కయా? (పైకిఁజూచి) ఓరీ విష్ణూ!

ఉ॥ మగ్గిన తాటిపండ్లవలె మామక వైరుల మస్తకంబులన్
నుగ్గుగ రాల్చువాఁడ హరినోటినిడాయు మృగంబురీతి నా
దగ్గఱ వేఁడొకం డనికి ధైర్యముతో నిలువంగ నేర్చు నే
పగ్గెగనంగ వచ్చెదను పాపి! హరీ! ఇఁక నెందుజొచ్చెదో.

సింహ:-అగ్రజా! సృష్ట్యాదినుండి యే మహోత్కృష్ట స్థానమునకై దేవదానవులు బాహాబాహీ పెనంగుచుండిరో యట్టి విశిష్టాధికార శోభితమగు నీ త్రివిష్టపసింహాసన మొక్కసారి మీరధిష్ఠించి మా కన్నులవండువుసేయఁ బ్రార్థన.

పద్మా:- [చిఱునగవుతో సింహాసన మెక్కును]

తార:- శ్రీ శ్రీ శ్రీ పద్మాసుర సార్వభౌమునకు...... జే
శ్రీ మాయా తనూజాగ్రజునకు...... జే
స్వర్గ సింహాసనా ధీశునకు ...... జే

[తారకుడు జే యనునప్పుడు పద్మాసురుడు-ఇంద్రుడు తప్ప తక్కినవారందరు 'జే' యనవలెను]

తార:- ఇంద్రా! నీవనుము.

ఇంద్రు:- శ్రీ శ్రీ శ్రీ పద్మాసుర సార్వభౌమునకు...... జే

పద్మా:- (సింహాసనము దిగి) సింహవక్త్రా! అనంతర కార్యక్రమ మాలోచింతమా?

సింహ:- అవశ్యముగ.

తార:- అగ్రజా! సైన్యసమేతుండనై వైకుంఠమున కేగుచున్నాఁడ.

పద్మా:- మంచిది.

(నమస్కరించి తారకుఁ డెడమవైపునకు నిష్క్రమింప కుడివైపునకు ముందు పద్మాసురుఁడు తరువాత సింహవక్త్రుఁడు తరువాత బంధింపఁబడిన యింద్రుఁడు తరువాత సైనికులు నిష్క్రమింతురు) తెర.






ఓమ్





# కుమార విజయము



(కుమారస్వామి యుద్ధము)

## తృతీయాంకము

స్థలము - క్షీరసాగరము

[పాలసముద్రముపై శేషశయ్య మీఁద విష్ణువు యోగనిద్రయందుండ లక్ష్మి తిన్నఁగా మేల్కొలుపుచుండును. మెల్లఁగా శేషశయ్య ఒడ్డునకుఁ జేరును. లక్ష్మీ విష్ణువులు దిగుదురు]

విష్ణు:- దేవీ! యోగనిద్రయందున్న నన్ను నీవు మేల్కొల్ప కారణ మరయక కోపదృష్టి ప్రసరించితిని. ఈ పాలసముద్రమున జాలరులరీతిఁ బడి యీదుచు గ్రోలుచు గోలసేయుచున్న వారెవరైయుండనోపు? అదుగో! మదాంధులగు దానవాధములు. వర్షాకాలమునందు క్షణములో వెలువడు ఉసుళ్ళవలె బయలుదేరినారు. కదలించి కదనమునకుఁ గాలుద్రవ్వుటయన నిదియే.

చ॥ కరుణ యొకింత లేక సురకంటకులై చరియించు వీరలన్
సరగున జంపి దివ్యులకు శాంతి సుఖంబొనగూర్పకుందునే?
దురితము సేయుటే పరమ దోహదమంచు తలంచు రాక్షసుల్
హరియన నెట్టివాఁడో తెలియంగలరిప్పుడె చక్రధారచే.

దేవీ! నీ విఁక లోనికేగుము. (లక్ష్మి నమస్కరించి లోనికేగును) దొంగ రక్కసులారా! మీ యంగంబుల పొంగు రణరంగంబున భంగంబొనర్ప కెంగేల చక్రంబుదాల్చి వచ్చుచుంటి. (నిష్క్రమించుచున్నాఁడు)

తెఱలో

తారకాసురమహారాజా! బలవంతుఁడగు వనమాలి శరజాలంబుచే కాలాంతకునిలీల మనసైన్యంబులఁ గొన్నింటిని గూలనేసినాఁడు. మిగిలినవారు పాలికలనిం దొలంగి నిలువక వలసఁ ద్రోవఁబట్టినారు. మీ ఆగమనము అవశ్యము అభిలషణీయము. (రక్తసిక్తాంగులై రాక్షసులు పరుగెత్తవలెను)

[తారకుఁడు గదాహస్తుఁడై ప్రవేశించుచున్నాఁడు]

తార:- (లోనికిఁజూచి) ఔరా! ఏమి వీరి మనోదౌర్బల్యము!

ఉ॥ కాకులగుంపులోన నొక గడ్డను జివ్వున ఱువ్వినంత, చీ
కాకున లేచిపోవునటు కాల్కొలఁదిం బఱుగెత్తుచుంటిరే
వాకొననేమిఁకం బిఱికివానికిఁ జావులు పెక్కుమార్లు—శౌ
ర్యాకరుఁడైన వానికి లయంబొకమారెగదా తలంపఁగా.

డేఁగనుజూచిన పావురములవలె నా సైనికులు ఈ భ్రష్టుంఁడగు విష్ణునిబారికి నిలుచుటకష్టంబని ఉక్కుదక్కి పిక్కబలము చూపుచుండిరి. నాయకుఁడు లేనిసైన్యనటన యిట్లుండునుగాఁబోలు. ఛీ! అట్లైన్నఁటికినిగాదు. మానహీనులగు వీరికిఁ దగునుగాని మానవంతుఁలెన్నఁడైనను మర్యాదమాసిపోవుట కిచ్చగింతురా? నా శౌర్యవాక్యములచే మరల వీరిని యుద్ధసుముఖులుగ నొనర్చెద, సైనికులారా! నా సమరధర్మోపదేశ మొక్కింత ఆలకింపుఁడు. సంగరరంగమును వదలి మీరేల పాఱిపోయెదరు? ఆకసమునుండి భూమిపైఁ బడువడగండ్లవిధమున- సలిలహీనకాసారమధ్యమత్స్యంబులవగిది- మనతనువు లెప్పుడో మాసిపోవును. ఇట్టిదానికై స్వధర్మమును వీడుట పాడిగాదు నైకుంఠవాసకంఠలుంఠనాకుంఠితాయుధహస్తుండనై నేనుండ మీరేల భయపడెదరు? రండు. రాక్షసరాజ్యస్థాపనార్థమై మీ రక్తమును ధారవోయుఁడు. దానవవంశమహోన్నతికై మీ ప్రాణములర్పింపుఁడు. దైత్యకులయశశ్చంద్రికను సర్వదిక్తటముల వ్యాపింపఁజేయుఁడు. అట్లుకానిచో "అంధకరదీపన్యాయముగా" మీ హస్తములందలి యాయుధములు

నిష్ప్రయోజనములు. ఏనాఁడుగాని నైరులకు జంకని స్వవంశ మునకు మాయని మచ్చఁ గూర్పఁ దలంచితిరా? నిలుండు... నిలుండు.

ఉ॥ ఏల రణస్థలిన్ విడిచి యేఁగెదరిట్లు పదుండు గాజులం
దాలిచి చేతులన్ జెలులదాపున ముచ్చట జెప్పుకొండు రే?
కూలిన మీకు స్వర్గమొనఁగూడును నా అసిధార గుండియల్
వ్రీలిన రెంటికింజెడిన రేవడులయ్యెదరింకఁ జూడుఁడీ!

అవిగో! సేనలు నిలిచినవి. వారిడాసి వలయురీతి వర్తింపఁ జేసెద.

విష్ణు:- (ప్రవేశించి) ఓరీ నీచులారా!

ఉ॥ నీతి దొఱంగి కాయములు నిత్యములంచుఁదలంచి వ్రేటుచే
కోతుల రీతి గంతులిడుకొంచును చెప్పక పారిపోయి, యీ
రీతి నియంతృవాక్యముల రేఁగిన మీ బలశౌర్యధైర్యముల్
చూతము రండు మిమ్మిపుడ చోద్యముగా జముగీముకంపనే?

తార:- (పద్యము చదువుచుఁబ్రవేశించుచున్నాఁడు)

శా॥ ఆలంబందున నాదుసైనికులు నీ యస్త్రాహతిన్ నిల్వలే
కీలీలం బరువెత్తిపోయిరని యోరీ శౌరి! నిర్భీతితో
మేళంబాడెదె? నల్లమేకవగు నిన్ మెక్కంగ ఈ సింహమే
కాలాంతంబుగ వచ్చుచుండెఁ గనుమా- గర్వోద్ధతిన్ మానుమా!

విష్ణు:- తారకా! నీవుశూరుడవని నే నెఱుంగుదు. దైత్యారియనెడి నా సార్థకనామము నీ వెఱుంగుదువా? అవతారంబులనెత్తిన దెల్ల అసురసంహారమునకే యని తెలియదా? అట్టి నాయట్టి జగజెట్టితో సంగ్రామంబున కొడిగట్టి నీ గట్టియసురుల నేల వీడెదు? కొంచెపుబుద్ధిని బెంచి మంచిమార్గమునకు రావించి మేలెంచి సుఖంబనుభవింపుము. నేఁజెప్పిన వాక్కులు నీమనం బునకు ఒప్పిదంబులు కావేని తిప్పలుపడక మానవు. నీ అబ్బ వంటివారు నా దెబ్బకు తబ్బిబ్బులైరి. ఏతత్పరాభవంబున కాసింపక నీ వెచ్చటినుండి వచ్చితివో యచ్చటి కేగుము.

తార:- ఓరీ! నల్లవాఁడా! నీ యెల్లిదపుమాటలిఁక మెల్లఁగ చాలిం
పుము. త్రుళ్ళిపడినచో మదీయ గదాదండంబుచేఁ ద్రెళ్ళెదవు.
వీరాధివీరులను జంపితినని విఱ్ఱవీగుచుంటివా?

సీ॥ ప్రళయకాలమునాఁడు ప్రాణభీతిని జెంది
మామగీమునడాఁగు మగతనంబు
హాలాహలజ్వాల నణఁపఁజాలక మహే
శా! యని పఱతెంచు సాహసంబు
దక్షయజ్ఞధ్వంస దారుణంబున వీర
భద్రునింగని పాఱు బాహుబలము
మును జలంధరుతోడ మోహరింబును మాని
వలసత్రోవనుబట్టు వాడితనము

గీ॥ ఎఱుఁగలేమొకో! నీవేల యెఱుఁగఁజేయఁ
బూనినాఁడ విసీ! తల్లి పుట్టినిల్లు
మేనమామకుఁ దెలుపంగఁ బూనినట్లు
చెప్పుకొననేల అయ్యయో! సిగ్గుచేటు.

విఘ్ను:- వదరుబోతా! నీ ప్రాఁత యెటులుండెనో గాని యెన్నియోరీతుల
నా చేతలఁదెల్ప నీ బుద్ధిని మరల్పనైతివే? నీమెడపైనెక్కొన
మృత్యుదేవత విననీయదులే. బాల్యంబాదిగ మీ వంశవృక్ష
మును ఛేదించుచున్న యీ విఘ్ననిబారికి నిల్చుట నిన్ను
సృష్టించినవానికైన వశమా?

గీ॥ త్రిపురరాక్షస సంహార దీక్షయందు
హరుని శరముగ నేనెగా అరిగినాఁడ
అరుగుటేగాదు దైత్యుల నాకసమునఁ
బట్టి గుండెలు చీల్చిన జెట్టినేన.

తార: (హేళనగా) ఓహోహో! మా శంకరునకు నీ వొక కొఱము
ట్టుగానుపయోగపడితివా? మారణాస్త్రముగనుపయోగపడుట
కంటె మా యెడ సమ్మోహనాస్త్రముగా నుపయోగ పడు
టలో నీకు మఱింత శక్తి యున్నదేమో! నీవు జగదేకవీరుడవు

గావు. జగన్మోహినీరూపధారివి. నాఁడు రాక్షసులోకపంక్తిగా
దేవతలోక పంక్తిగాఁ గూర్చుండ నడుమ అమృతకలశము
చంక బెట్టుకొని గజ్జెలందియలు ఘల్లుఘల్లుమని మ్రోగ సురా
సురల తలలూఁగ నాగకన్యవలె నాట్యముచేసిన శృంగారరస
వాహినివి జగన్మోహినివి నీవేగదా! ఏంతమోసము; ఆ వింత
వేసము!

శా॥ నీ ప్రజ్ఞన్ సుధనీక మాదనుజులన్ - నిర్వీర్యులం జేయఁగా
పాపాచారుల నిర్జరాధములఁగాపాడన్ జగన్మోహినీ
రూపంబీవుధరించి మించితివె ఆరూపంబుతో వచ్చి మ
త్కోపంబెల్ల శమింప నాట్యకళ నాకుంజూపుమా మాధవా!

విష్ణు:- నాట్యకళగాదు. జగన్నాటకకళనేచూపఁగలను. ఆనాట్యకళ
తోనే మీ భస్మాసురుని భస్మముచేసితిని. అమృతమంద
కున్నను మీ యహంకృతి యింతవింతగ నున్నదే యందిన
నింకెంతగనుండునో. నిన్నగాక మొన్నకన్ను దెఱచినచిన్నవా
డవు. కన్నుబోవునంత కాటుక పెట్టుకొనఁబోకుము.

ఉ॥ చంపితి సోమకాద్యసురసంఘము భంగమునొంది క్రుంగగా
జంపితి నీదుసైనికుల సంగరరంగమునందునిల్వఁగన్
జంపెద నిన్నునీహితుల శార్ఙ్గవిముక్త శరాళి, దాసుడన్
జంపకు నన్నునీవనుచు. సాగిలిమ్రొక్కకయున్న రాక్షసా!

తార:- కార్యశూరునకు వాగాడంబరముండదు. నీచే రక్షింపబడు
చున్న దేవతలందఱు మాచే శిక్షింపబడుచున్నారు. తెలియునా?

మ॥ ఇఁకనీ మాటలు కట్టిపెట్టుము రణంబెంతేని సాగింపుమా
ప్రకటంబౌను బలాబలంబులు వృథావాగ్వాదమింకేలరా
సకలాశల్ క్షణభంగురంబులయి పో సాష్టాంగదండంబు మా
కొకమార్వెట్టి క్షమింపవేడినను విష్ణూ నిన్నుమన్నింతునే!

విష్ణు:- (కన్నెఱ్ఱఁజేసి) శృతిమించినది రాగము. త్రుళ్ళినయెద్దు
గంతమోయక మానదు.

ఉ॥ కాలులుపేర్లెదేల చెడుగా! చెడుకాలము చేరువయ్యె నీ
నేరములన్ని కూడి యిటు నెత్తైను మృత్యువునోటఁ బెట్టఁగాఁ
గారణమించలేక యపకారము చేసెడి కూరకర్ములక్
నే రణమందుఁ గూల్చుటది నిక్కము రమ్మిఁక దుష్టదానవా!
[ఇరువురు గదలు త్రిప్పుచు లోనికేగుదురు]

తెఱలో

విష్ణు— దుష్టదానవ కంఠలుంఠనంబగు మదీయచక్రమును
విడచుచున్నాను. కాచికొమ్ము.

[చక్రము విడువ అది మంటలతో గిరగిర తిరుగుచు తారకుని తాకఁబోవును]

విష్ణు:- (ప్రవేశించి ఆశ్చర్యపడి) కలుషాత్ములకంఠములు ఖండించెడి
నా చక్రము ఈ తారకునిపై కరిగి వజ్రతుల్యమైనవాని వక్షము
మున కలంకారప్రాయమైనది.

తార:- (ప్రవేశించుచు)

చ॥ వగవగనేల? వీరులనివార్య బలోదయ యుద్ధధర్మ మె
ప్పుగిదిని అస్త్రహీనుని గృపారహితాత్ముకులై రణంబులోఁ
దెగ నఱుకంగనెంతురె? మదిం దలపోసితి నీదుపాటు ఓ
ఖగగమనా! శరంబు గొను కాచితి నింకను ధర్మబుద్ధిచే.

విష్ణు:- దైత్యాధమా! నన్ను రక్షించునంతవాడవైతివిగా?

శా॥ చక్రంబీగతి వక్రమైనదసి నీచా! నిక్కెదే చూడు భూ
చక్రంబెల్లను దల్లడిల్ల నిఁక నస్మత్తూర్కర నారాచముల్
మీఁక వ్యాదులతో నినుం బ్రళయకాళీదేవి కర్పింపనే
యీ కీడ్పాటున కేను నిన్విడునరా యీర్ష్యానమిత్త త్వరా!

ఇదిగో! ప్రళయాగ్నికణ సన్నిభంబగు నారాయణాస్త్రము
వదలుచున్నాను. (వింట సంధించును)

తార:- ఇదిగో! పాశుపతాస్త్రమును సంధించుచున్నాను.

(ఇరువురుసంధించివిడువసిద్ధముగా నుండ శంకరుఁడు ప్రవేశించి యిరువుర
మధ్యనిలిచి చేతులతో వారించుచు)

శంక:- లక్ష్మీవల్లభా! శాంతింపుము. తారకా! ఆఁగుము. మీరీ
రెండస్త్రములు వదలితిరేని మీ జయాపజయము లట్లుండ

ముందు జగత్ప్రళయము సంభవించును. కావున, లోకముల మేలెంచి మీమీ యస్త్రముల నుపసంహరించుకొనవల యును. తారకా! శివకేశవులకభేదమని యెఱుంగుము.

[శంకరుఁడు నెమ్మదిగ జరిగి విష్ణువునకుఁజాటుగనిలువఁ బడినంతనే తారకుఁడు తలవంచి నమస్కరించుచుండ విష్ణువదృశ్యుఁడగును. శంకరుఁడు దత్తాత్రేయునివలెఁ ద్రిమూర్త్యాత్మక రూపము ధరించుచుండు. కుడిభాగమున విష్ణు వెడమభాగమున బ్రహ్మ మధ్య శంకరుండు ప్రకాశింపవలెను. తారకుఁడాశ్చర్య పడి తలవంచి నిమీలితనేత్రుఁడుకాఁగా క్షణములో విష్ణు శంకరులు వేర్వేరుగా యథాస్థానములనుండ తారకుఁడు నమస్కరించి నిష్క్రమించుచున్నాడు.]

(తెర)






ఓమ్






# కుమార విజయము

(కుమారస్వామి యుద్ధము)



## చతుర్థాంకము

### ప్రథమరంగము

స్థలము – సత్యలోకము

[సరస్వతీ బ్రహ్మల మందిర సింహద్వారముచుట్టు రత్నములు వెలుఁగుచుండును. తలుపులు వేసియుండును. నారదుఁడు నృత్య గానలోలుఁడై సమీపించుచుండ ద్వార రక్షకులు నారదునకు నమస్కరించుచున్నారు.]

నార:- ఎండలో నడచు బాటసారికిఁ జలి పందిరివలె లోకములోఁ దిరిగి తిరిగివచ్చిన నాకు ఈ బ్రహ్మ మందిరమెంతో హాయి గూర్చినది. ఇది పరమ భక్తులకుఁ గళ్యాణదుర్గము. పరమ హంసలకు అపవర్గము. [చిఱునగవు] ఇది నిర్మలత్వమునకు నిలయము. ఆనందమున కాలవాలము. అరిషడ్వర్గములకు దూరము. అజ్ఞానమునకు భారము. ఆశలేని వారందుకొను చోటు—— అహంకారుల కిది తెఱచాటు. సాకారము నిరాకారమున కొకబాట. అందులకే నిత్యము నా పాట.

సీ॥ ఎవ్వానిసంకల్ప మీ చరాచర సృష్టి
కాది కారణమౌచు నలరుచుండు
ఎవ్వానివాక్కున నింపుగా సొంపుగా
స్వరయుక్తముగ శ్రుతుల్ వఱలుచుండు

ఎవ్వానివాహనం బెలమి పాలును నీరు
వేరుచేసెడిశక్తి వెలయుచుండు
ఎవ్వానిరాణి జ్ఞానేందిరమై వీణ
పలికించి సుఖమెంచి పాడుచుండు

గీ॥ ఎవఁడు వెలుఁగును స్థిరమైన యెఱుకగలుగు
నచల యోగీశ్వరుల సహస్రారమందు
నట్టి పరమాత్మ రూపు నే ననవరతము
కొలుతు మనసారఁ గలుషపుఁ గలఁతదీఱ.

[సింహద్వారముదగ్గఱ మోకాళ్ళపై నిలిచి నమస్కరించుచు]

ఓ కమలాసనా! నీ దివ్యస్వరూపము చూడవచ్చిన యీ బిడ్డ నొక్కసారి యనుగ్రహింపుము (గానము)

[మనుష్యులు కూర్చుండఁదగినంత పెద్దవిగా రెండు తెల్లతామరలు ఎత్తుగానుండవలయును. వానియాకులు, కాడలు స్పష్టముగాఁ గనఁబడుచుండవలెను. ఆ రెంటినడుమ పెద్ద రాజహంస యుంచవలయును. ఆరెండుపూలపై సరస్వతీ బ్రహ్మలు కూర్చుండవలయును. నారదునిపాట పూర్తికాఁగనే తలుపులు తెఱచినట్లు తెఱ రెండుగా విడిపోవలయును. అప్పుడు సరస్వతీ బ్రహ్మలు ప్రత్యక్షమగుదురు.]

బ్రహ్మ:- ఆత్మానంద సిద్ధిరస్తు.

నార:- కన్నులున్న ఫలమిప్పుడు కలిగినది. ఈ అనిర్వాచ్యానందము అనుభవైకవేద్యము ప్రభూ!

సేవ:- (ప్రవేశించి) దేవా! ఇంద్రాదులు మీదర్శనమునకై ద్వారము కడ వేచియున్నారు.

బ్రహ్మ:- లోనికిఁ బ్రవేశపెట్టుము.

సేవ:- చిత్తము. (నిష్క్రమించును)

[ఇంద్రుడు బృహస్పతి ఖిన్నవదనులై ప్రవేశించుచున్నారు]

ఇంద్రు:- బృహ:- సరస్వతీ బ్రహ్మలకు నమస్కారము.

బృహ:- ఓ సత్యలోకాధీశ్వరా!

ఉ॥ సృష్టికి ముందొకండవయి సృష్టియొనర్పఁగ మూఁడురూపులై
దృష్టికి నీవ స్త్రీ పురుష దేహములన్ ధరియించి కన్పడన్

గష్టము నీ మహామహిమ కన్గొని చాట హిరణ్యగర్భ! మా
యిష్టము లెట్లు తీర్చెదవొ: యీ వొకరుండ వెవిక్క కావుమా!

బ్రహ్మ:- శాంతిరస్తు. (శేతిపాలఁజూచి) మంచుచేఁ గాంతికనఁబడని చుక్కలవలె మీ ముఖములు కళాహీనము లైనవేమి?

నార:- ఇనను సూర్యుఁడునయించినప్పుడు పద్మములవలె మీ దర్శనమున శోభ నొందుచున్నవి.

ఇంద్రు:- నారదమహర్షి గూడ సమయమునకుండుట మా భాగ్యము.

బ్రహ్మ:- అష్టదిక్పాలురకు, అమరులకు క్షేమమా?

బృహ:- మా క్షేమమునకు క్షామముకలిగినది. మీచే, శివునిచేవరములందిన పద్మాసురాదులు విజృంభించి ముల్లోకముల జయించిరి. వారిధాకకు ఇంద్రుని వజ్రాయుధము మొక్కవోయినది. యముని దండము నిస్తేజమై భూమినిద్రవ్వు కఱ్ఱవలెనున్నది. వరుణుని పాశము గరుడమంత్రముచే కట్టఁబడిన పామైనది. గదలేని కుబేరునిచేయి కొమ్మలు నఱికిన చెట్టువలె నున్నది. పడఁగొట్టుదురను భీతిచే దివ్యవిమానములు తిరుగవు. ఆకాశగంగలోని తామరలన్నియు వారి దిగుడుబావులలో చేరినవి. సముద్రుఁడు రత్నరాజముల నేరికోరి కానుకగా సమర్పించుచున్నాఁడు. జీవమణులుగల వాసుకి మొదలగు సర్పములు వారియిండ్లలో నాటిపోని దీపములుగా నుపయోగపడుచున్నవి. ఉచ్చైశ్శ్రవము వారివాహనమైనది. కల్పవృక్షము కత్తిదెబ్బలకు గురియగుచున్నది. చెఱలోనున్న దేవతాస్త్రీలు పద్మాసురాదులు నిద్రించుచున్నప్పుడు మాత్రమే యేడ్చుచున్నారు. వారిలో తారకుఁడు లోకనాశనమునకుఁ దోఁకచుక్కవలెఁ దోఁచినాఁడుప్రభూ! (విచారముతోఁ దలవంచును)

ఇంద్రు:- పరుండినప్పుడు పాన్పుగా, కూర్చున్నప్పుడు సింహాసనముగా, నిల్చినప్పుడు గొడుగుగా నే యుజ్జ్వలాంగునకు సహస్రమణిగణ ఫణాలంకృతుఁడగు శేషుఁడుపయోగపడుచుండునో యా మహానుభావుఁడగు విష్ణువువిడిచిన చక్రముగూడ వానికి

పక్షస్థలాలంకారమైనది. కట్టా! మా యిక్కట్టులింకెట్టులఁ దీఱఁగలవు?

బ్రహ్మ:- నీరు వెనుకకు మరలుటచేఁ బ్రవాహమున కేదియో యడ్డు తగిలెనని యూహింపవచ్చునుగదా! బిడ్డలారా! నన్నిప్పుడు కోరున దేమి?

బృహ:- వారి మరణము.

బ్రహ్మ అది నాపనిగాదు. విసపుచెట్టైనను దానుబెంచి తానే త్రుంచుట మంచిదిగాదు. ఈశ్వరుఁడైనను దనచేతులతో వారిని జంపఁడు.

ఇంద్రు:-మహాత్మా! మాకింకేదిదారి? తగినసేనాని లేకపోవుటచే దేవతలకీ గతిపట్టినది. ఆ సృష్టి మీ రొనర్చి మమ్ము రక్షింప వలెనని ప్రార్థన.

బ్రహ్మ:- ఆ సృష్టి నావలన జరుగదు. ఈశ్వరాంశసంభూతుఁడు తప్ప అన్యుఁడు వారల జయింపలేఁడు.

నార:- మహాతపోదీక్షలో నున్న మహేశ్వరునకు సంతానమెట్లు కలుగునుస్వామీ!

బ్రహ్మ:- సూదంటురాయిచే నినుమునాకర్షించినట్లు పార్వతీదేవి సౌందర్యముచే నీశ్వరుని మనస్సునాకర్షింపవలయును. ఆ శివుని కుమారుఁడు సేనానాయకుఁడై రాక్షసులఁజంపి బంధింపఁబడిన దేవతాస్త్రీలను విడిపింపఁగలఁడు. ఆపైని మీకు సర్వము శుభమగును.

(బ్రహ్మమందిర సింహద్వారపుతలుపులు వేయవలెను. నారదాదులు నమస్కరించి ముందుకుఁబోవుచుండ మధ్య మేడతెఱ దింపవలెను.

(నారదుఁడు గానముతో నిష్క్రమింపఁబోవుచుండ నింద్రుఁడడ్డుతగులును.)

ఇంద్రు:-మహాశయా! మీరుకొంచెముసేపుండవలయునని మా ప్రార్థన.

నార:- (తలపంకించి) ఆపదలోనున్న వారిమాట యాలకించుట పరమ ధర్మమే. (జనాంతికముగ) నన్నుసాక్షిగ నుపయోగించుకొనుట కిదియొకయెత్తు.

బృహ:-సురకార్యసౌధమునకు శంకుస్థాపన చేయవలసినవాడు మన్మథుఁడు,
ఇంద్రు:-ఔను ఆ మనసిజుఁడొక్కసారి యిటకు వచ్చు,గాక.
మన్మ:-(ప్రవేశించియింద్రునిజూచి) జయము జయము సురనాథునకు.
ఇంద్రు:-దిగ్విజయము మన్మథునకు.
బృహ:-స్వాగతము రతీధవునకు. నూఱంచు కత్తులరాణించు జోదుల నొక్కచోఁ గనులపండువుగాఁ గాంచుచున్నారము.
మన్మ:-మునికులతిలకా! నమస్కారము.
నార:- యశస్విభవ స్థిరస్తు.
మన్మ:-(ఇంద్రునిజూచి) అనురాగసూచకమైన మీ యాహ్వానము నకు కారణమరయవచ్చునా?
ఇంద్రు:-(చిఱునగవుతో సాభిప్రాయముగ మన్మథునివంకఁ జూచును)
బృహ:-సంకల్పమాత్రమునఁ జనుదెంచిన మీ సరసజ్ఞతను గుర్తించి సుర సార్వభౌముఁడు సాదరముగ సహస్ర నేత్రములతోఁ జూచుచున్నాఁడు.
మన్మ:-గమనించుచున్నాఁడను.
నార:- (జనాంతికముగ) అవసరజ్ఞులగు ప్రభువుల కామాత్రము నేర్పు లేనిచో బండి మొండివడును, కోటలు బీటలువాఱును.
బృహ:- ఇతరుల నేదైనఁ గోరునప్పుడు వారేమనుకొందురో యని సందేహించుట మృదుల హృదయుల లక్షణము.
మన్మ:-నావంటి యాత్మమిత్రుని విషయమున సందేహమేల సురరా! మహేంద్రా! నీవు కోరుటయు, నీ మన్మథుఁడు కాదనుట యునా? ...... కల్ల,

సీ। అలిగి యెవ్వతె నీ ప్రియురాండ్రలోన
నిన్ను వేధించుచున్నదో నిజముచెపుమ!
ఆమె స్వయముగవచ్చి నీ యడుగులంటి
వేడుకొనఁజేయు నిప్పుడె వెసలువాఁడ.
లేక నీస్థానమాక్రమింపఁదలఁచి దైత్య దానవులందెవ్వఁ

డైనఁ దపోదీక్షలోనున్నాఁడా! వానిపేరు జెప్పుము. స్త్రీల బాహు పాశములచే వానిబంధించెద. నాశక్తి ననుమానించుట నన్ను పర [illegible] ుట, ప్రభూ! ఎక్కుపెట్టిన బాణముచే ముక్కంటినైన [illegible] ుపఁగలను. తక్కినవారొక లెక్కయా?

బృహ:-ఇది మాకు వాగ్దానము.

మన్మ:-కాదు. ప్రతిజ్ఞ.

నార:- [జనాంతికముగ] మఱసీల బాగుగా బిగియుచున్నది.

ఇంద్రు:-(మన్మథునిభుజముపైఁ జేయివేసి) ఇది నిశ్చయమా?

మన్మ:- ముమ్మాటికి.

నార:- (జనాంతికముగ) పిట్ట వలలోఁ జిక్కినది. ప్రభువులు తమ యధికార సౌధమునకు అన్యుల తను ప్రాణములను మెట్లుగాఁ గట్టుకొందురు.

ఇంద్రు:-మిత్రరత్నమా! ఈశ్వరునిపైనను బాణము విడుతుననుటచే మాపని నీవు పూనుకొన్నట్లే. ఎవరిపైన నా వజ్రాయుధము పనిచేయదో యా తపశ్శాలురపై నీవను నస్త్రము బాగుగాఁ బనిసేయఁగలదు. భూమిని మోయుశక్తిని జూచియే విష్ణువు శేషుని తన శయ్యగాఁజేసికొనె. నీ మహిమ తెలిసికొనియే నిన్నీపనికిఁ బంపుచున్నారము.

నార:- (జనాంతికముగ) మిన్నువిఱిగి మీఁదఁబడినది. (మన్మథుని జూచి) రతీకళత్ర! విషయరహస్యము నేనే యిఁక విప్పిచెప్పెదవిను. దాక్షాయణి యోగాగ్నిలో దగ్ధమైనది మొదలు ఈశ్వరుఁడు నిస్సంకల్పుఁడై మహాతపోనిష్ఠలో నిలిచియున్నాఁడు. దాక్షాయణి పార్వతియనుపేర హిమవంతునకుఁ గూఁతురుగాఁబుట్టి పరమేశ్వరుని పరిణయమాడఁగోరి తండ్రియాజ్ఞచేఁ దఱియెఱిగి భవుని సేవించుచున్నది. ఆమెసేవాదీక్ష వర్ణనాతీతము.

గీ॥ శివతపోవేది నిత్యమ్ము-చిమ్మిచల్లి
విరులు దర్భలు తోయముల్-వేగఁదెచ్చి
పార్వతీదేవిశ్రీఘుమెల్లఁ బాయుచుండు
శివశిరశ్చంద్రచంద్రికా-శీతలమున

కాని, మహేశ్వరుని మనసించుకయు మాఱలేదు. ఆ మహానీయుని తపస్సు చెడఁగొట్టవలయునని ఇంద్రాదులు నిన్ను గోరుచున్నారు.

మన్మ:-శివతపోభంగమా? అబ్బా! ఇది సింహఘంటాన్యాయము.

నార:- ఏన్యాయమో! లోకమంతయు నన్యాయము. కాలుజాఱినఁ దీసికొనఁగలముగాని నోరుజాఱినఁ దీసికొనలేము.

మీనకేతనా!

గీ॥ నోటిమాటలు మాత్రైన నుడువవచ్చుఁ
గార్యసాఫల్యమునఁగాదె కలుగుఘనత?
చెప్పునంతటి సులభంబె చేయుటనిన?
దూఁకుమనువారు తోడుగ దూకఁగలరె?

ఉ॥ ఐనను నాశ్రితప్రకరమహాత్ములు వారలజీవితంబు లే
మైనన్గాని లోకమునకంతకు మేలొనగూర్చుటొక్క-టే
ధ్యానికిఁ గారణంబగును దావకజన్మము సార్థకమ్ముగాఁ
బూనుము దీని; కష్టములు పొందనివాఁడు యశంబుగాంచునే?

మన్మ:-నిజముమునీంద్రా! నిజము. కాలమును గమనింపక యే కార్యముసేయరాదు. కానిమ్మని కాలకాలునిపైఁ గవియుదునా? యమ్మహాత్ముఁడు కన్నుతెఱచెనేని ముందు నా కార్యము కాకమానదు. ఊరకుందునా మాటతప్పినవాఁడ నగుదును. ముందుఁజూచిన నూయి. వెనుకకుఁబోయినగోయి.

నార:- కష్టములు రెండురకములు. విరుద్ధపరిణామములుగల యీ రెండును భగవంతుని యాయుధములు. ఒకటి యగ్నిలోఁ బడిన కట్టెవలె దురాత్ముఁడు సర్వనాశనమగుటకుపయోగపడును. రెండవది పరీక్షాసూచకమై యగ్నిలోఁబడిన బంగారమువలెఁ గలు

షములడంచి కాంతిపెంచును. ఇది సన్మార్గులయందుపయోగ
పడును. కావున, నొకటి విషమయము. రెండవది యమృత
మయము.

బృహః-మదనా! ఒక్క-మనవి.

గీ॥ వృత్రసంహార మొనరించు వేళ నమరు
లెఱిఁగి యడుగ దధీచి వెన్నె ముకనిడఁడె?
శివసుతునిఁగోరి యీపని సేయు దేని
నీవు కీర్తి గడింతువు నిశ్చయముగ.

మన్మః-మాటవరుస కనినమాట మీకుఁ బెట్టినప్పుఁగోట యైనది.

ఇంద్రః-రతీకళత్రా! పద్మాసురాదుల చావు శివునికుమారుని చేతిలో
నున్నదని బ్రహ్మ చెప్పినాఁడు. ఆపని పార్వతీపరమేశ్వరులకు
సంబంధించినదైనను నీ సహాయము గావలయును. నేలయు,
విత్తనమున్నను అంకురమునకు నీరుప్రధానముగదా! కావున,

ఉ॥ ముప్పదిమూఁడుకోట్ల సురముఖ్యులకోరెడివారు-చూడఁగా
నిప్పని ముజ్జగమ్ములది- హింసయుఁగాదది- పూలువాలుగా
నొప్పిన నీ పరాక్రమ గుణోన్నతి సన్నుతి నొందుటబ్రమే!
తప్పక యీ జయంబునన ధన్యుఁడవయ్యెదవీవు మన్మథా!

మన్మః-(ధైర్యము తెచ్చికొని) అన్నిఁటికి నా భగవంతుఁడే గలఁడు.
సురేంద్రా!

మ॥ శరసంధానముసేసి శంకరునిపై సమ్మోహనాద్యస్త్రముల్
పఱపింతున్- ఘనయోగమెల్లఁదృటిలో భగ్నంబు గావింతు అ
గ్గిరిజాతం దలపింతు- మోహజలధిక్రీడార్థిగావింతు- స
చ్చరితుండైన కుమారు జన్మమునకై సాధింతు నెక్కార్యమున్.

బృహ- ఇంద్రుః-తథాస్తు!

(అనుచుండ మన్మథునిపై దేవతలు పూలుచల్లుచుండ నారదుఁడు పాటపాడుచుండ)

తెఱ

# ద్వితీయరంగము - శివతపోభంగము

స్థలము — దేవలోకము

[జగన్మోహనాకారులగు రతీ మన్మథులు సమ్మోహనాస్త్రమువంటి కమ్మని గానముతో శృంగార రసద్యోతకమగు నృత్యము చేయుచు చెరియొక దెసనుండి ప్రవేశించి కలసి యేకరీతిగాఁ గొంచెముసేపు నృత్య గానములఁ బ్రదర్శించిన పిదప]

మన్మ:- ప్రేయసీ!

సీ॥ సొగసుగాండ్రకు మంచి సుందరాంగులఁ గూర్చఁ
బుణ్యకాలమునకుఁ బొంచిపొంచి
ఎల జవ్వనంబునఁ గులుకు స్త్రీ పురుషుల
మోహసాగరమున ముంచిముంచి
కొమరుఁ బ్రాయపువారి కోర్కులు తమి మించఁ
బ్రియ బంధనంబులఁ బెంచిపెంచి
విరహుల హృదయారవిందంబు లరసి నా
అంచుల బాకుచేఁ జించి చించి
గీ॥ కామినులచూపు తూపులఁ గలఁచికలఁచి
కలికి వలపుల రతనాలు తొలఁచి తొలఁచి
మదను కేళికి మనసుల మలఁచి మలఁచి
ఆట నాడింతు జగ మొకనాటకముగ.

రతి:- (మన్మథుని భుజముపైఁ దలవాల్చి) నిన్నెవ రాడింతురు?

మన్మ:-నీవే. నా సంకల్పమునకు ఫలస్వరూపిణివి నీవే,

గీ॥ నళినదళనేత్ర! నీచూపు-నాకు తూపు
తరుణి! నీయాట-నాకు రత్నాలబాట
కలికి! నీ యండ-నాకు బంగారుకొండ
నీవులేకున్న-నా కళానిరతి సున్న.

రతి:- నీ రతిలేనిచో నీ రసము నీరసమా మనోహరా? (చిఱునగవుతో శృంగారరస దృష్టిని బతిపైఁ బ్రసరించి) జగన్మోహనాకారులగుమీ రే యాడువానిగొప్పతన మొప్పుకొనుచున్నా రే!

మన్మ:-మృదుమధురహావభావభాసురమైన నీ జీవిత మొక రసగంగాధరము సతీ!

రతి:- (కులుకుచు) నా జీవితముగాదు. నీ జీవితమే మధురాతి మధురము. నీ విల్లు మధురరసముల కిల్లు. నీ ముల్కి మధు వొల్కు. నీ నారి మధుపాన విహారి. నీ తేరు మధురఫలము కోరు. నీ సేన మధుమాస కళాప్రదర్శనమున నెఱజాణ. మధుఁడు నీ మహిత హితుఁడు. నీ మనసు మధురము. నీ సంబంధ మేది మధురముగాదు నాథా!

మన్మ:-చాలుచాలు. సరససాహిత్యమునఁ దోడికోడల మించఁదలంచితివా? ప్రకృతిరహస్య మొక్కసారి పలుకఁ దలంచితివా?

రతి:- నిజము పలుకఁ దలంచితి. ప్రకృతిలో సహజసౌందర్యము మగవారిదే. పశుపక్ష్యాదులలో సైతము మగజాతిదే. క్రిక్కిరిసినజూలుచే సింహమునకుఁ జక్కఁదన మెక్కువగుచున్నది. దగదగ మెఱయు కోరలచే మగయేనుఁగే సొగసు గుల్కుచున్నది. అవయవ సౌందర్యమున నావుకన్న నాఁబోతు మిన్న. పోతు నెమిలికి మాత్రమే పింఛము విప్పి నాట్యమాడు భాగ్యమున్నది. పుంజు రాచఠీవితో ముందంజ వేయుచున్నది. ఇంకేదేవిశాద నెదవు నాథా! (చిఱునవ్వు) వినను మీరనినట్లు స్త్రీ జీవితము రసగంగాధరము. కనుక నే శివుఁడు గంగాధరుఁడయ్యెను.

మన్మ:-[ఏదియో జ్ఞప్తికివచ్చినట్లు]గంగాధరుఁడు...శృంగారరసము...ప్రేయసీ! నా శరశరాసన తూణ తనుత్రాణాదులందీయుము.

రతి:- (తెచ్చి వింటినెడమబుజమునకుఁదొడిగి యమ్ములపొది కుడి వీపునకుఁగట్టి పుష్పబాణములు చేతికిచ్చి) ఏదీ ఒక్కసారి యిటుచూడుము. ఇప్పుడు జగదేకవీరుని వలె నున్నావు. నీ దివ్యసుందరవిగ్రహము చూడ నా రెండుకన్నులు చాలవు. నిన్ను —

గీ॥ మేల్మి కరగించి క్రొక్కారు మెఱుపు నించి
రత్నములు చెక్కి రసములు రాసిబోసి
అమృతమును బూసి సృజియించె నబ్జభవుఁడు
శ్రీ కళాకార! సుకుమార! శ్రీ కుమార!

మన్మ:-నీ దృష్టి తగులునేమో!
రతి:- నా దృష్టి యెప్పుడో తగిలినది.
మన్మ:-తగులకున్న నీ తగులముండునా? దేవీ! త్వరగా వెళ్ళివచ్చెద.
రతి:- ఎచ్చటికీప్రయాణము?
మన్మ:-"ప్రథమకబళే మక్షికాపాతః" — అడుగుబయట బెట్టుచుం
డగనే ఆడువారడుగుప్రశ్న.
రతి:- అధికారముచేఁ గాదుప్రియా! అనురాగముచే.
మన్మ:-ఔనౌను. (చిఱునగవుతో) మంచుమలకు.
రతి:- ఎందులకు?
మన్మ:-దేవతల పనికొఱకు.
రతి,- ఆపని నే వినఁ గూడదా?
మన్మ:-ఇది సమయము గాదు.
రతి:- ఐన నేనుగూడ వచ్చెద.
మన్మ: ఇది రెండవ యపశకునము. (యోచించి) రతీ! రాఁ దలంచి
తివా? రమ్ము. (నడచి) సతీ! నాచేచాయఁగఁ జూడుము.

మ॥ అదె కైలాసము- కాశహాసతటినీహారాబ్జడిందీరపా
రద సంకాశము- స్వర్ధునీతట మయూరశ్రీయుతేచ్ఛానటత్
త్రిదశోల్లాసము- దృగ్విలాసము- సదా దీవ్యత్కళాగారస
ద్వదళాశోభిత శర్వవాసము- యశోభాసమ్ము ప్రాణేశ్వరీ!

[నిష్క్రమించి మఱియొకదెసనుండి ప్రవేశించుచున్నారు, ఇప్పుడు హిమాలయ
మనోహరదృశ్యములన్నియు నద్భుతముగాఁ గనఁబడుచుండును ]

మన:-దేవీ! ఇంవలి మహత్తరమైనప్రదేశములను గనుఁగొనుచుంటివా?
రతి:- చూచుచుంటిని. కాని, ఏప్రదేశము ఎట్టి పుణ్యవంతమై శాశ్వ
తచరిత్రాత్మకంబై సందర్శనమాత్రంబున సర్వపాపవిమోచ

నంబై యలరారుచున్నదో యెఱిఁగింపుఁడు.

మన్మ:-ఇప్పుడు సావకాశముగఁ బరికించుటకు వ్యవధి లేదు. కాని, సమీపభూముల విశేషములఁ దెల్పెద. మెల్లఁగా నడువుము. (నడచి) కలికీ!

ఉ॥ మున్ను భగీరథుండు తనపూర్వులకై తపియించి గంగ నీ
యున్నత శృంగరాజముల నుండియు భూమికిఁ దెచ్చినాఁడు- వి
ద్వన్నుతయైన శాంకరిని భార్యగఁ గోరు జలంధరాసురుఁ
గన్నన శంకరుండు తెగఁగాల్చె నిటఁ సెగకంటి మంటతో.

(నడచి) ఇది అఖాతము- అది జలపాతము. ఇవి గండశిలలు--అవి కొండతలలు. ఇది మానసమునకు బాట- అది సెలయేటియూట. అది రత్నపు మొలక - ఇది నెలరాలపలక, అవి వియచ్చరల యానములు. ఇవి యచ్చరల గానములు. అవి సానువులు- ఇవి వేణువులు. ఆ కెలంకుల కోలంకులు.—ఈ దెస కుసుంభకుసుమవిసరములు.

రతి:- వికారాకారములుగల ఆ విలుకాండ్రెవరో గుర్తింపఁగలరా!

మన్మ:-వారే కిరాతులు. వారినెత్తివి పికిలిపిట్టల యీఁకలు. మెడలోనివి పాలపూసలు. కట్టుకున్నవి పారుటాకులు. గుత్తులుగుత్తులుగా పడియున్నముత్తెముల వరుసలుగని మత్తగజముల మస్తకముల భేదించిన సింహములజాడ తెలిసికొనివారు వేటాడుచుందురు.

రతి:- (వినుటనభినయించి) ఏదియో గంభీరశబ్దము వినవచ్చుచున్నది.

మన్మ:-గంగానదీఘోషము. ఇటురమ్ము. (నదిని సమీపింతురు)

రతి:- పరమపావనీ! గంగాభవానీ!

గీ॥ తల్లివో లెను జీవనాధారవగుచు
సకలజీవుల రక్షింపఁ జాలినావు
దేవకార్యార్థ నాదేవు కావుమీవు
దేవదేవ జటాసంగ! దివిజగంగ!

[సింహగర్జనమును విని సహింపక నంది అంకెవేయును. అదివిని భయపడి రతి మన్మథుని కౌఁగిలించుకొని మెడ వెనుకకుత్రిప్పి చూచుచుండును]

మన్మ:-(రతిని దిన్నఁగావదలించుకొని) అబలా! ఏల యీలీల బేల వైతివి? సింహగర్జనమునువిని సహింపక—

చ॥ బసవఁడు అంకెవేసె సిత పర్వతసీమల చాల దట్టమై
మిసమిసలాడు పచ్చికనుమేసి మహోర్బటి కాలుత్రివ్వుచున్
బుసలిడుచున్ విశాలమగు మూపుర మల్లలనాడ గంటలా
కసమున కంటు శబ్దములు గల్గఁజేయ మహాద్భుతంబుగా.

మనమింకను చాలదూరము పోవలయును. తొందరగా నడువుము (నడచి) ఇదియే యీశ్వరుని తపోవనము.

రతి:- ఎక్కడిదీ సువాసన?

మన్మ:-ఏనుఁగులు రుద్దుకొనుటచే దేవదారువృక్షములు పట్టలూడి పాలుగారి పరిమళించుచున్నవి.

రతి:- మనోహరా! ఏమి యీ వన మనోహరత్వము! ఆహా! అందమున నందనవనమును గ్రిందుచేసినది.

మన్మ:-అకాలమున నా యాజ్ఞ నెరవేర్చుటలో వసంతుఁడుచూపిన నవ్యకళా మహిమ. అతఁడు నిజమైనహితుఁడు. మల్లెలు మొల్లలు- సరోజములు సన్నజాజులు- మావులు కొ్రివులు- మందారములు మాలతులు పుష్పించి యిత్తావుల నెత్తావులఁ జిమ్ముచున్నవి. మార శరకారుఁడన్న పేరు మాధవున కిప్పుడు సార్థకమైనది. శుకపికశారికానికరములు పుష్పలతలపై కిల కిలారవములతో కళకళలాడుచు జయగీతికలు పాడుచున్నవి. చేతనాచేతనములందును శృంగారరసము పొంగుచున్నది.

గీ॥ ఆఁడులేఁడికి మగలేఁడి హాయిఁ గూర్పు
గీరుచున్నది కొమ్ముతోఁ గోరిచేరి
తిన్నఁగాఁ దేఁటి యొక్కపూగిన్నెలోన
ఆనుచున్నది తేనె యర్ధాంగితోడ.

అదిగో! దక్షిణామూర్తియనుపేర సనకాదిఋషులకు జ్ఞానోపదేశము చేసిన సర్వేశ్వరుని వాసప్రదేశము. దానినే స్థాణ్వాశ్రమమందురు. హరు నెఱుకలేక ఆకల్లాడదు. ఎట్లో నందీశ్వరుని గనుబ్రామి శీఘ్రమ శివతపోభంగ మొనర్పవల యు... రమ్మి.

రతి:- (నివ్వెఱపడి) ఇందులకా నీ విటకు వచ్చినది? సమాధి నిష్ఠా గరిష్ఠుఁడైన హరునిపైనా శరములు విడుచుట? ఇదియా దేవ తల ప్రార్థన? వలదు నాథా! వలదు.

మన్మ:-నీవా మాట యనలేదు. నే వినలేదు. తిరిగి చనఁదగదు. ఫలము గలదు.

గీ॥ అరయు మింతేల-సమ్మోహనాస్త్రలీల
బెదరెదవు చాల-ఇత్తరి భీతియేల?
పొల్లుపోవదు సుమ్మి-నాపూవుటమ్మి
మాట యిచ్చితి బాల-నే మరలఁజాల.

ముప్పదిమూఁడుకోట్ల దేవతల కధిపతియైన మహేంద్రున కిచ్చినమాట తప్పినచో నా తలిదండ్రులగు లక్ష్మీనారాయ ణుల కీర్తికిఁ గళంకము తెచ్చినవాఁడ నగుదును.

రతి:- ఔను. కాని, ప్రణవనాదమునకుఁ బ్రణయ వినోదమునకు సుదూరము నాథా! విషయము విషమించెనేని విషమనేత్రుఁ డు విషకంఠుఁడుసుమా! నా కుడికన్నదరుచున్నది. ఇది నిప్పు తోఁ జెలలాట. కాదు. అంతియకాదు. అగ్నిపర్వతమును భేదించుట వలదు....బలముచాలదు. మరలిపోదము రమ్మి. ... రావా?... రావేని నీవు బాణములు తొడుగుట... నేను ప్రాణములు విడుచుట.

మన్మ:-నేనీ పనికిఁ దలఁగిన దేవతలకష్టములు తొలఁగవు. నీకుఁదెలి యదు. పిఱికిమందు పోయకుము. పరోపకారదీక్షతో ప్రాణ త్యాగమునకైనను వెనుకంజవేయను.

రతి:- నామాట వినవా పతీ!

మన్మ:-వినను రతీ!

రతి:- సందిగ్ధస్థితి. ఆహా ఏమి నీ ధృతి. ఇంకేదిగతి? నా అంతరాత్మ ఆకాశవాణివలె నేదియో యశుభమునే సూచించుచున్నది. అడుగావలఁ బెట్టనీయను. (పాదములంటి) నా మంగళసూత్రి మేలకో గజగజ వణఁకుచున్నది. నీ పాదములంటి బ్రతిమాలు చుంటి. వినవా? జీవితేశ్వరా! (మన్మథుఁడు లేవనెత్త)

ఉ॥ ఎన్నఁడు వేఁడలేమరతి యేటికి నేఁటికిఁ గాళ్ళవ్రేళ్ళపైఁ
దిన్నఁగవ్రాలి జాలిమెయి దేవరప్రార్థన సేయుచున్నదో
యెన్నఁగలేవ? ఏటికెమరీదుట మేలాకో! ఆఁడుదాని మా
టన్నను లెక్క-సేయవు కదా! మితిమించినధర్మమొప్పునా?

(కన్నీరువిడుచును)

మన్మ:-అత్యవసర సమయమునఁ దెలివిగలస్త్రీ యుపయోగించు నాయుధము కన్నీరు. దేవీ! ఏల నాశక్తి నింకను శంకించెదవు?

గీ॥ చూపు తూపుల యేపున కోపఁగలదె
దేవదానవ మానవ భావజగతి
సిశ్చల సమాధి నిష్ఠలో నిలువకిపుడ
భంగపడి యీశ్వరుఁడు నాకు లొంగిపోఁడె?

రతి:- ఆర్యపుత్రా! ఏమి నీధైర్యము?

గీ॥ అలుమటన్మోడ-షూలి నేత్రాగ్ని యేడ
రెండు డీకొన మన జయముండు టెడ?
అన్ని యశుభములని యాడ-నిన్ను వేడ
వలచివచ్చితి నీతోడ-వలపుతోఁడ!

మన్మ:-దేవీ! ఇఁక నీ మాటలు నాచెవింజొఁఅవు.

రతి:- (ఆలోచన నటించి) కానున్నది కాకమానదు. ఓ దేవత లారా! మీరందఱు నా పతికి శుభాశీస్సులు పంపుఁడు.

మన్మ:-ఇటురమ్ము. [నడతురు. మధ్య తెఱతొలఁగ నించుకమూలగ కొంచెము దూరమునఁ దపోనిష్ఠయందున్న శంకరుఁడు కనఁబడుచున్నాఁడు]

మన్మ:- దేవీ! నీవిఁక నొక్కయడుగు ప్రక్కకుఁ దొలఁగుము.

[రతి ప్రక్కకుఁ దొలఁగి చాటుననుండును]

మన్మ:- ఈప్రదేశమంతయు నందీశ్వరుని యాజ్ఞచే నెంతప్రశాంతముగ నున్నది! చెట్లు కదలవు. తుమ్మెదలు రొదసేయవు. జంతువులు సంచరింపవు. ఈవనము పటమున వ్రాయఁబడిన బొమ్మవలె నిశ్చలముగా నున్నది. (శంకరునిజూచి) ఆహా! పరమేశ్వరుని దర్శనమ్మున్నఁ బావనుఁడనైతి. ఔరా! ఏమి యీ మహానుభావుని తేజము! దేవదారు వృక్షముక్రింద పులితోలు పఱచుకొని కుడిప్రక్క త్రిశూలము నాటి దానికి డమరుకము కట్టి వీరాసనము వేసికొని పాముతో నెత్తి కట్టఁబడిన జడలతోడను, జడలలోనుండి వెలువడు గంగతోడను, గంగనురుగోయనఁ దోఁచు బాలచంద్రుని తోడను, చెవికిఁదగిలించిన జపమాలతోడను, కనుఱెప్పలించుకఁ దెఱచి నాసాగ్రమున లక్ష్యముంచి గాలిలేని తావున వెలుఁగుచున్న దీపమువోలెఁ బ్రకాశించుచున్న హరునింజూచితి. ధన్యుఁడనైతి. (సరిగఁబరికించి) బ్రహ్మరంధ్రమునుండి లేచిన తపోగ్నికి బాలచంద్రుఁడు వాడిపోవుచున్నాఁడు, పరమశివుని పరివేషము వలదని నన్ను వారించుచున్నది. చూడఁజూడ నా గుండె జారుచున్నది. చేయి వణఁకుచున్నది. బాణము లెట్లు వేయఁగలను?...... ఇది శివతపోభంగమా? రణరంగమా? (మరలఁజూచి) యోగమును జాలించి కనులించుకఁ దెఱచినట్లున్నది. నంది నమస్కరించి యేదియో చెప్ప శివుఁడు కనుసైగతో నంగీకరించుచున్నాఁడు. (దిగులుపడి తలవంచుచు) కష్టా! ఏమినాకష్టము! (తిన్నఁగాఁ దలయెత్తిచూచి) ఆహా! ఏమి నా అదృష్టము! (పార్వతి పుష్పాదులు తెచ్చి నమస్కరించి శివునిదగ్గఱ పెట్టఁబోవుచుండును) పార్వతీదేవి శివపూజార్థము పుష్పఫలాదులు తెచ్చినది. ఆ తల్లి నడుముతో నా ధనుస్సు వంగుఁగాక! ఆమె చూపుతో నా తూపు ప్రసరించుఁగాక! అర్థ నిమీలిత

నేత్రుఁడై యాత్మ సాక్షాత్కారమున కుద్యమించుచున్నాఁడా? ఏమైన నగుఁగాక! ఇదియే సమయము. (సమ్మోహనాస్త్రము విడచును) ఆఁ! కనులుదెఱచి పార్వతివంకఁ బ్రేమతోఁ జూచుచున్నాఁడు. ఆమెయు సిగ్గుతో మోమును బ్రక్కకుఁ ద్రిప్పుకొనుచున్నది. ఎదురెదురుగానున్న సింహ వృషభముల ముఖములు వికసించినవి. ప్రకృతిచేఁ బరమాత్మ యాకర్షింపఁబడుచున్నాఁడు. (పార్వతి యొక్కొక్క వస్తువు శివునిపళ్ళెరమునఁబెట్టుచుండును) నాసమ్మోహనాస్త్రము వృథయగునా? మఱియొకబాణము విడచెద. (ప్రత్యాలీఢపాదముతో విడువ సిద్ధముగనుండును)

శంక:- విద్యుత్ప్రవాహమువలె నవ్యక్తమధురానురాగ రసవాహిని నా దేహమున జనించి పార్వతీ పరిణయపయోధివైపు ప్రవహించుచున్నది. నా తపోభంగము కావించిన దురాత్ముఁడెవఁడురా? అస్మదీయ ఫాలనేత్రాగ్ని జ్వాలాప్రసరణంబున వాఁడు భస్మమగుఁగాక? (ఫాలనేత్రము విప్పును. పార్వతి భయమున నిష్క్రమించును)

ఆకాశమున దేవతలు:- దేవా! మహాదేవా! జయశీలా! కరుణాలవాలా!
దేవతలమేలుగోరి శాంతింపుము. అనుగ్రహింపుము.

మన్మ:-(జ్వాలపడుచుండ భయముతో) హతోస్మి...హతోస్మి.

[నేలపైఁబడ జ్వాల చుట్టుముట్టును. శంకరుఁ డదృశ్యుఁడగును. అనఁగా మధ్య తెఱ వేయవలెను]

రతి:- (ఆతురతతో) హా నాథా! (మూర్ఛపడి కొంతసేపటికి లేచి) హా జీవితేశ్వరా! నన్నీడనాడి పోవుచుంటివా! ఇఁక నాకుదిక్కెవరు? నీవులేనిచో నాకీ దేహమేల? విరాగియైన భోగివలయుని సరాగుంజేయ వలదాగు మాగు మని యెంత నేఁగొట్టుకొన్నను త్యాగంబునఁ బూఁగోలనేసి యుసురులం బాసితే? ఓ దివిజులారా! నాపతిని రక్షింపరేమి? కొఱవితోఁ దలఁగోకికొనుమని పంపినది మీరేగదా! ఓ పరమేశ్వరా!

ఆ॥వె॥ పూలవేయ నిన్ను బూజించు టేగదా
కోపపడిన భర్త లోపఁగలదె?
లోకరక్షకుఁడని లోఁ దలంచెనుగాని
హింస చేసెదవని యెఱుఁగఁడకట!

(చంద్రునుద్దేశించి) తండ్రీ చంద్రా! నీ వా విషకంఠుని సహవాసము చేసిన దానిఫలము చూపితివే. పెఱవారి నైన నిష్కారణముగఁ జంపుచుండఁ జూడ మనసొప్పదే! నీ వొక్కింత యమృతము చిలికి సజీవుం జేయవేమి? ఇట్టి కఠినాత్ముండ వగుటఁ జేసియే విరహిణీజన సంతాపకరుండవై వారిచేఁ దిట్లు తిని పదియాఱువ్రక్కలగుచు సిగ్గులేక కళకళ లాడుచుంటివి. ఛీ! నిన్నుఁ గఁదలఁపరాదు. ఐనవారి నాశ్రయించుటకన్నఁ, బడినచోట దేవులాడుట మేలు. (గంగనుద్దేశించి) నిర్మల జల తరంగా! గంగా!

గీ॥ ఉంచుకొన్న వాఁడు తలకెక్కించుకొన్న
వాఁడు నాకేమి యని గర్వపడెదవీవు
పతికిఁ గష్టముగల్గుచో సతి కృశింపు
తెఱవ! తెలియు నె నీయట్టి తిమ్మరులకు.

(మగని శరీరముఁ జూచుచు) పడినరీతిగా శరీరమంతయు బూడిదయై పావురమువలె- ఇంద్రధనుస్సువలె- పలురంగులు కలిగియున్నది. ఓ గిరిజామనోహరా! నన్నుఁ జూచి లతా లలితాంగులు సైతము అంగలార్చుచు పూఁదేనె నెపంబునఁ గన్నీరు కార్చుచున్నవే. నీ యెద కరఁగదా?

ఉ॥ పెద్దవు గొంతుకన్ విసపువ్రేగున మాటలనాడెదీవు నీ
సుద్దిని విశ్వసింపఁదగుచో నిటు సేయుదె? వంశవృద్ధికై
తద్దయుఁ జూచు నా మగని తామసివై మసిచేసితిట్లు నీ
కిద్ది శుభంబె? నిక్కముగ నేరికి మేలొనరింప కీడగున్.

ఇఁక నాకేదారిఁ జూపెదవు? అయ్యో! అసంగతి నిన్న డుగనేల? చెట్టును బెల్లగించిన దాని చుట్టుకొన్న దీఁగను వేఱ

పెల్లగింపవలయునా? ఇప్పటికే పతినివిడిచి రతి, క్షణికాల ముండఁగలిగెనను నింద నొందితి. ఇత్తఱి నాకుఁ జితిపేర్చు వారెవ్వరు? ఓ వసంతుఁడా! నీకైన నాగోడు వినిపింపలేదా? లేక, నీ చెలికానితోఁబాటు నీవుగూడ బూడిదవైతివా? కాకున్న నేల కాన్పింపవు? కష్టములో ఆదరింపని బంధుత్వము స్నేహము నిజమైనదగునే?

వసం:- (ప్రవేశించి) అమ్మా! నీ పాలె నేనును నిప్ప్రయోజకుఁడనైతి. నామిత్రుని చరిత్రమాత్రము పవిత్రమైనది. దేవకార్యమునఁ గాలు కర్పూరము దివ్యమంగళ సూచకముగదా!

రతి:- వసంతుఁడా! నా కళాజ్యోతి యారిపోయినది. నా విలాసగతి మ్రాఁటిపోయినది. మా యీ యవస్థనుజూచుట కిప్పుడు కన్నులుదెఱచితివా? నీ చెలికాఁడు- పూవిలుకాఁడు నాకొక కాలికిఁ బారాణివెట్టి దేవతలు పిలిచిరని యిటువచ్చినాఁడు. అది పూర్తిచేయుటకు నాదగ్గఱకు రప్పింపుము. కాదేని నా ప్రియునికడకు నన్నుఁగొనిపొమ్ము. చంద్రునితో వెన్నెలయు, మేఘముతో మెఱుపును అస్తమించునటుల పతిదేవతలు భర్తతో నస్తమింతురు. మాకు నీవు పలుమార్లు పూసెజ్జల నమర్చియుంటివి. ఇప్పుడు చితిపేర్చి యగ్నిముట్టింపుము. పిదప మా యిరువుర కొఱకే జలాంజలినిచ్చి కడసారి బంధుకృత్యము నెరవేర్పుము.

వసం:- పూలుచల్లిన చేతులతో నిప్పులుచల్లవలెనా తల్లీ!

రతి:- అది నీ దోసముకాదు. ప్రకృతిలో నిదియొక విచిత్రధర్మము. వేనిక నిముసమైన నిలువఁజాల.

వసం:- సాధ్వీమణీ! పరుగెత్తిన పొద్దుగ్రుంకునా! ఎండకాలమున నీరింకుటకుఁ దల్లడిల్లిన మత్స్యాంగన తొలకరివానలచేఁ గులుకకున్నదునా? తల్లీ! ఊరడిల్లుము.

రతి:- రాజాజ్ఞనిక్షేపించిన రక్షించువారెవ్వరు? నాయొజ్జగడనే కడతేర్చిన నాకేడ మనుగడ? నీవాలసించుట యపకారముసేయుట.

[పతిపైఁబడి దుఃఖించుచుండును]

వసం:- అమ్మా! నీయాజ్ఞ శిరసా వహించుచున్నాఁడ.

[లోనికేగి చితిపేర్చి మండించును]

## ఆకాశమునః దేవతలు

దేవదేవా! శివా! నీ నేత్రాగ్నికిఁ బార్వతీదేవిసైతము భయపడి తన్నుపరాభవించినట్లు భావించి తల్లిచెంత కరుగుచున్నది. ప్రభూ! విజృంభించిన విద్యుత్తు నెవరుచూడఁగలరు?

ఉ॥ ఈవు దలంచుకొన్న జగమెల్లను నిప్పగు నీరగుఁ శివా!
కావుము మన్మథుఁ రతిని కారణ జన్ములు వీరు లేనిచో
జీవులు నీరసమ్ములగు సృష్టి నశించును లోకనాథ! నీ
సేవలుసేయు దేవతల చింతలుబాపవ దారిఁజూపవా!

రతి:- (నలుదెసలు పరికించి నిరాశతో) దేవతల ప్రార్థనఁగూడ వృథయైనది. ఇఁక నా రోదన మరణ్యారోదనమే. ఓ మృత్యుంజయా! నా ప్రియునిఁ గాల్చిన యగ్నిని చల్లార్చినది నీవ. అంతకంటె వేయిరెట్లు రగులుచున్న నా హృదయాగ్నిని చల్లార్పలేవా? లేనిచో నాయగ్నితో నన్నుఁగూడ దహింపరావా? అర్ధాంగిని విడుచుటచే నీ పని సగమే పూర్తియైనదని యెఱుఁగవా? మేములేనిచో అందము- ఆనందము మందునకైన దొరకునా? సృష్టి జరుగునా? కళలు వెలుఁగునా? లోకమంధకారబంధురమైపోదా? పతివ్రత భర్తనుచేరలేదా? చూడుము.

[దుముకఁబోవ నెదురుగ శంకరుఁడు ప్రవేశించుచున్నాఁడు. రతి మోకాళ్ళపై నిలువఁబడి శంకరునకు నమస్కరించును.]

శంకర:- రతీ! నీ పతిభక్తికి మెచ్చితి. నీ వంటి సాధ్వీమతల్లులు లేని యెడల ప్రపంచము జరుగనేరదు. ఇప్పటినుండి నీ భర్త నీకు మాత్రము కనఁబడుచు సర్వ సౌఖ్యముల చేకూర్పఁగలఁడు. ఇతరులకుఁ గనఁబడఁడు. దీన నీకు మేలగు.

రతి:- ధన్యురాలను.

తెర

ఓమ్






# కుమార విజయము



(కుమారస్వామి యుద్ధము)

## పంచమాంకము

### ప్రథమరంగము

స్థలము – పద్మాసురుని భవనము (పానశాల)

[వేశ్యలు నృత్యముచేయుచు నెడనెడఁ బద్మాసురుని పానపాత్రిలో మద్యము పోయుచు నతనికి సంతోషము కలిగించుచుందురు. పద్మాసురుఁడు మద్యపానము సేయుచు వేశ్యలతోఁబాటు సంతోషము వెలిబుచ్చుచు, వేశ్యలవంకఁ దీవ్రదృష్టితోఁజూచి వారిని బొమ్మని సైఁగసేయ భయముతో నిష్క్రమింతురు.]

పద్మా:- ఛీ!...మద్యము. ఇదియేమిమధువు? సారహీనము. నిస్సారము. ఆఁ! మఱచితి. అమృతము సంగతి మఱచితి. ముల్లోకములను జయించితి. ముగ్గురుమూర్తులను మూలలకొదిగించితి. ఇంద్రాద్యఖిలసురలఁ సేవకులఁ గావించితి. వైరి స్త్రీలను బంధించితి. సార్వభౌమత్వమును స్థాపించితి...కాని, యమృతము చిక్కలేదే! అందువలన నాకివియన్నియు నిష్ప్రయోజనములే యని తోఁచుచున్నది. కుచ్చితులగు దేవత లమృతము నెచ్చట దాచిరో ఆఁ! అచ్చరలు... రంభ తప్పించుకొని పోయినది. మేనక కానరాలేదు. ఉన్నఊర్వశి తిన్నగఁగన్ను మొఱఁగినది.

[వినుట నటించి]

**[తెలిలో–చెంచుపాట]**

ఏలుకో లోకాలు – నాసామీ

ఎవరడ్డు నీకింక – నాసామీ

నీ కీర్తి చంద్రికలు - నాసామీ
నిఖిలదిక్కులనిండె - నాసామీ
చెంచుగూడెములెల్ల - పంచినా పనిసేయు
పెంచిమీసముదువ్వ- నాసామీ
కంచుకోటలుకట్టు నాసామీ॥ ఏ॥

వ॥ దొడ్డదొరగారు మారాజుగారుసెలవిస్తే లోపలికివస్తాముదొరా
[పద్మాసురుఁడు సైగచేయ సేవకుఁడు చెంచులవారిని "రండు" అని పిలుచును]
వాతాపి-ఇల్వలుఁడు(చెంచువేసములతో ప్రవేశించుచు) మా వొడ్డ
సంస్థానం... పెద్దదొరగారి మొగానేవుంది రావుకళ-

ఏలుకో లోకాలు - నాసామీ
ఎవరడ్డు నీకింక - నాసామీ
నీయుండచేతనే - దండి దైత్యులపిండు
చండప్రచండులై- నాసామీ
కొండపిండిగసేయు నాసామీ॥ ఏ॥

సేవ:- ఒరే! చెంచులూ! రాజుగారికి కొంచెము శృంగార రసము.
వాతా:-చిత్తముదొరా చిత్తము.

## పాట

పద్మాసురునిజూడు- చెంచీతా
బహు సుందరాంగుడే- చెంచీతా
చుక్కల్లొ చంద్రుఁడే- చెంచీతా
చూడ చక్కనివాఁడే- చెంచీతా
చక్కనీచుక్కవే- చెంచీతా
సరసమ్ములాడవే- చెంచీతా
గుట్టెక్కియాడవే- చెంచీతా
చెట్టెక్కిపాడవే- చెంచీతా
గండుకోయిలతోడ- కలిసి కూశావంటె
నీదె పైచేయౌను చెంచీతా-
నిన్నె కొనియాడుదుము చెంచీతా॥ ప॥

పుట్టపొంతననీవు- చెంచీతా
పొంచి నిలిచుండవే- చెంచీతా
చెట్టుచాటుననీవు- చెంచీతా
చేరి మాటాడవే- చెంచీతా
అలినీల వేణివి- జలజాతపాణివి
అందాల రాణివే- చెంచీతా-
సందేహమేలనే- చెంచీతా॥ ప॥
ఏకాంతమధుసేవ- చెంచీతా
ఎంతయానందమే- చెంచీతా॥ ప॥

పద్మా:- ఏ దేశమురా మీది?

వాతా:-ఓ మాది వటద్వీపములే సామీ. దేవతలకు రాక్షసులకు జరిగిన యుద్ధాల్లో మేము రాక్షసులవైపునిలిచి యుద్ధము చేశాం. అందువలన దేవతలు గుర్తుపట్టకుండా వుండడానికి ఈ వేషాలతో తిరుగుతున్నాము దొరా.

పద్మా:- (ఆలోచన నటించి) ఏమది? ఈకంఠధ్వని మున్ను పరిచయము గలదిగా తోచుచున్నది. నన్ను మోసముచేయుటకు వచ్చిన వారు కారుగదా (ఆలోచించుచు సేవకునికి సైగచేయ సేవకుడును తానును వాతాపియిల్వలులకు రెండువైపుల దగ్గఱగా కత్తులుపట్టియుంచి) నిజముచెప్పుఁడు.

వాతా:-రాతికి చక్కలిగిలేముంది దొరా. ఓ మీ యిష్టమువచ్చిన పరీక్ష చేసికోవచ్చు.

పద్మా:- (సేవకునితో) తలగుడ్డలు తీయుమురా.

సేవ:- (వారి తలగుడ్డలుతీసి ఆశ్చర్యముతో) ప్రభూ! ప్రభూ! మీ మేనల్లురు- వాతాపీ ఇల్వలులు.

వాతాపి- ఇల్వలుఁడు- మామగారికి నమస్కారములు.

పద్మా:- (చిఱునగవుతో) ఓ హో హో! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు- రండు కూర్చుండుడు- ఎందులకీవిచిత్ర వేషధారణ?

ఇల్వ:- మీ గూఢ [illegible]గా తిరుగుటకు- దేవతల రహస్యములు తెలిసికొనుటకు.

[వారు పద్మాసురున కిరుప్రక్కలనున్న ఆసనములపై కూర్చుందురు. పద్మాసురుడు సైగచేయ సేవకుడు వాతాపి ఇల్వలులకు గూడ పానపాత్రలందిచ్చును]

సేవ:- ప్రభూ! మీకుగూడ మధువు......

పద్మా:- ఆ!...మధువు నిఖిల మధురరసనిర్మిత మధువు ఇప్పుడేగదా సేవించినది. ఐనను నా ప్రాణబంధువులైన వాతాపియిల్వలుల సంతోషముకొఱకు మఱియు కొంచెమాస్వాదించెద. ఆ!... ఏదీ... (తీసికొన ముగ్గురు త్రాగుదురు)

వాతా:-మామా! ఇదేమిమద్యము. మేము ప్లక్షద్వీప, కుశద్వీప, క్రౌంచద్వీప, శాఖద్వీప, శాల్మలీద్వీపాదుల దిరిగితిరిగి భారత వర్ష వింధ్యాటవీ సంచారసమయమున అక్కడ ఆటవికులగు బోయలు- కోయలు- చెంచులు- సవరలు......

పద్మా:- ఆ! ఎన్నిరకములవారున్నారేమిరా?

వాతా:-ఎన్నిరకాలేమిటిమామా! ఒక్క బోయల్లోనే చెంచుల్లోనే ఎన్నో తెగలవాళ్ళున్నారు. అడవిచెంచులు- గయితచెంచులు- వాసరచెంచులు-పుట్టచెంచులు-ఆటచెంచులు-వేటచెంచులు- ముత్తరాసిచెంచులు- బాసకోయలు- ఒద్దికోయలు- డోలు కోయలు- కాకకోయలు- కమ్మరకోయలు- గుమ్మకోయలు- గుట్టకోయలు- మొదలైన తెగలెన్నోవున్నాయి మామా... తాటికల్లు- ఈతకల్లు- జెంకాయకల్లు- ద్రాక్షసారా-ఇప్పపూ సారా- తాటిసారా- అబ్బో! చెప్పలేనన్నిరకాలపానీయాలు- కుక్కమూతికూజా- కొంగమూతికూజా-బాతుమూతికూజా- కోతిమూతికూజాలతో బహూకరించారు. ఎలావున్నాయిరా యిల్వలా?

ఇల్వ:- ఎలా వున్నాయేమిటి? ఆ తీపు- ఆ ఊపు- ఆ ఏపు- ఆ కోపు- ఆ లాహిరీ- వహ్వారే. యెంతనివర్ణించేది మామా!

పద్మా:- మఱి నాకునోరూరునట్లు చెప్పుటయేనా ...

వాతా:-వివిధద్వీపాలనుండి తెచ్చిన మధుకలశాలతో మనపానశాల యంతయు నింపివచ్చాము. మదురపండిన తాటిపండులాగా- అత్తిపండులాగా......

ఇల్వ:- తెగ ముదిరిన కడుగునీళ్ళులాగా...

వాతా:-ఏరోయి- మామగారిని వరుసాడుతున్నావే. నీవలె చెంచుల వేషంలో ఉన్నాడనుకొన్నావా? ఎంతైనా...పెద్దవాడు-సురా సురసార్వభౌముడు. తెలుసా?——

ఇల్వ:- ఓ! తెలియకేం. మధ్యమధ్య వరుసైనవాళ్ళతో కాస్త సరసం ఆడకపోతే సంభాషణ ఉప్పులేని కూరే.

పద్మా:- నిజమేరా యిల్వలా. అదిలేనిదే మజాలేదురా.

ఇల్వ:- సరే! అన్నా ఏమిచెప్తున్నావ్.

వాతా:-మదురపండిన తాటిపండులాగా- అత్తిపండులాగా గమగమ వాసనేస్తున్నాయి. మీరు కడుపునిండా త్రాగవచ్చు- కావలసినంత ఇతరులకు పోయవచ్చు-

పద్మా:- మా సోదరి- అజముఖికి కుశలమా?

ఇల్వ:- కుశలమే- ఆమె దొరికిన దేవతాస్త్రీలనెల్ల మాయోపాయమున బంధించి మనచెఱసాలకు చేర్చుచున్నది మామా!

పద్మా:- మీరో?

వాతా:-ఋషులను, దేవతలను బాధించుటలో మాది అందెవేసిన చేయి.మాయలుపన్నడంలోమన పేరుముందుచెప్పాలి. కాని...

పద్మా:- ఏమా సంశయము?

వాతా:-అగస్త్యుడట... అగస్త్యుడు... పూర్వము సముద్రమును ఆపోశనముపట్టె యందుదాగిన అసురులను హతముచేయించుటేగాక ఇప్పటికిని మనవారికి అంతులేని అపకారము చేయుచున్నాడట. అతి సమర్థుడట. అతనిఅంతు కనుగొనుటయెట్లా యని యాలోచన?

ఇల్వ:- అన్నా? అపాయములేని ఉపాయము ఆలోచిస్తామంటివే?

వాతా:-నాకేమి తోచలేదురా! సోదరా!

ఇల్వ:- తోచేదేమిటి! మనము కామరూపులముగదా. నేనొకచక్కని దేవతాస్త్రీ రూపముధరించి యాతనిదగ్గఱ నృత్య గానములు ప్రదర్శించి ఆతనిమనస్సు చల్లగా ఆకర్షిస్తాను. తీరా దగ్గఱకు వచ్చేసరికి బలాత్కరిస్తున్నాడు. నాథా! రక్షించండని కెవ్వున కేకవేస్తాను. చెట్టుచాటునో, పుట్టచాటునో ఉన్న నీవు హఠాత్తుగావచ్చి ఆ ఋషిని అమాంతంగా స్వర్గానికి పంపించవచ్చు. అంతటితో మనపీడా వదలిపోతుంది.

వాతా:-అతడు నన్ను చూడగనే రాక్షసుడనని శంకించి శపిస్తే...

ఇల్వ:- శాపమా గీపమా! ఆ గాబరాలో స్వస్వరూపాన్ని మఱచి కిందుమీదౌతాడురా,

వాతా:-ఏమో! ఆతడు విశ్వామిత్రుడులాగా ఆకర్షింపబడడేమో-

పద్మా:- ఐతే-వాతాపీ- అంతకంటెమంచిఉపాయము నీవుపన్న లేవా?

వాతా:-అదే చూస్తున్నా మామా- ఒరే! ఇల్వలా! ఋషులను మోసముచేయాలంటే ఋషిరూపాలే ధరించాలిరా!

ఇల్వ:- ఏదో వేశావే యెత్తు- ఏదీ కాస్త రానియ్-

వాతా:-మనమిద్దరము గురువు శిష్యులరూపం ధరిస్తాము. అతడువచ్చే దారిలో ఆశ్రమం కల్పించి తంబురమీటుచు తత్వాలుపాడు కుంటూఉంటాము. ఆయనరాగానే ఆతిథ్యానికిఆహ్వానిస్తాము.

పద్మా:- ఆహ్వానించినచో హాయిగాతిని వెళ్ళగలడు. ముందు యుద్ధము చేయదలంచి చివఱకు కూతునిచ్చి పెండ్లిచేసినట్లు-

వాతా:-లేదు మామా! ఇక్కడేఉన్నదిమజా! ఇల్వలా! నేను మేకగా మారతాను- నన్ను చంపి యా మాంసము వండిపెట్టు. అతడు తిని బయటికివచ్చి నిలబడగానే శుక్రాచార్యులుగారు చెప్పిన సంజీవనీమంత్రం లోలోనజపించి నన్ను బ్రతికించి నాపేరుతో కేకవేయి. వెంటనే నాతనిపొట్ట చించుకొని బయటకువస్తాను. అంతటితో ఆఘట్టం ముగిసిపోతుంది. గోడలకు చెవులుంట వంటారు, కొంపదీసి ఇదియెవరువిన లేదుగదా.

## [తెఱలో నారదుని గానము]

పద్మా:- ఈ జడదారి తనదారిని పోవువఱకు మీ రాగ నేల? మీపనికి మీరుపొండు- మీక శుభముగలుగుగాక-

[వాతాపి యిల్వలులు బిత్తఱచూపులతో నిష్క్రమించుచున్నారు]

పద్మా:- వీణాపాణి... నోరు మాటలాడుచుండ నొసలు వెక్కిరించు చుండును. మ్రింగరానికబళము. (నారదుఁడు ప్రవేశింప) బహుకాలదర్శనము. సమయమునకే వచ్చుచుందురు. మీ దర్శనభానూదయము లేనిచో వార్తాప్రపంచ మంధకార బంధురము. (పీఠము జూపి) దయచేయుఁడు.

నార:- (కూర్చుండి) నాకు రెండే ముఖ్యమైనపనులు. విశ్వకళ్యాణము నకు సంచారము. ఏకాంతమున నాత్మవిచారము.

పద్మా:- మునీంద్రా! నాకు మద్యము హృద్యముగాలేదు. అమృతము కావలయును. నీవు సర్వజ్ఞుఁడవు. అది యెచ్చట నున్నదో చెప్పఁగలవా?

నార;- (నవ్వి) అమృతము కావలయునా? అది లభించుటకుఁ గొన్ని యర్హతలుండవలయునే .. సరి సరి. అమృతమున కేమిగాని ఉన్నమాటయన్న నులుకుండదుగదా!

ఉ॥ ఆమున ముజ్జగంబుల మహోర్భటి గెల్చిన పాలకుండ నా
కేమని సర్విచారమున నీ గతిఁ గన్నులు మూసికొంటివా?
సేమములేని దేవతల చింతలు చిచ్చులుగాఁగ మాటి నీ
యామము నడంచునేమొ యిఁకనైనను ఱెప్పలువిప్పి చూడుమా!

పద్మా:- నేను కన్నులు మూసికొంటినా? ఔను...... మైకము చేత. (వికటముగ నవ్వి) నేను గన్నుతెఱచిన లోకము కన్ను మూయవలయును.

నార:- ఇంకను వెనుకటిధోరణియే. అట్లైన లోకముపోకడ నీవుగమ నించుట లేదన్నమాట! తలతగిలినప్పుడుగదా తడవుకొనుట!

పద్మా:- ఎవరు?

నార:- పద్మాసురుఁడే! కాయలున్న చెట్టునకేగదా రాళ్ళ దెబ్బలు!

మీా వైరులకు దేవతలు శంకరునకుఁ గుమారుఁడుపుట్టినఁ దమ కష్టములు తీరఁగలవని నమ్మి తత్కార్యసిద్ధికై మన్మథుని బంప నతఁడు యోగసమాధినున్న భవునిపైబాణమువేసి యమ్మహా త్ముని కంటి మంటచే బూడిదయయ్యె.

పద్మా:- (వికటముగనవ్వి) భళీ! మంచి ప్రాయశ్చిత్తము జరిగినది. చెలుపకురా చెడెదవు. తరువాత?

నార:- తరువాత రతీదేవి సతీత్వమువలన మన్మథుఁడు శివునిచే ననంగుఁడుగా ననుగ్రహింపఁబడియె.

పద్మా:- అరెరే! ఎండినమ్రాను చిగిర్చినదా? పిమ్మట?

నార:- పిమ్మట. సప్తర్షులు పెండ్లిపెద్దలుగనుండఁ దపంబునఁ దన్ను మెప్పించిన పార్వతిని బరమేశ్వరుండు పరిణయమాడెను. పంచబాణుండట్లు పంచత్వంబు జెందినను పంచబాణములు పంచాననునిపైఁ బనిచేసినవో యనఁ గుమారసంభవముగలిగె. గంగాతీరంబున నబ్బాలుండు షడ్కృత్తికల స్తన్యపానముచేఁ బెరుగుచుండఁ బార్వతీ పరమేశ్వరులువచ్చి కృత్తికా నక్షత్రమునఁ గుమారస్వామిని నిశ్చలభక్తితోఁ బూజించినవారలకుఁ గుమారులుగలుగుదురుగాక యనిదీవించి కుమారు నెత్తుకొని కైలాసమున కరిగిరి. శుక్లపక్ష చంద్రునివలె దినదినాభివృద్ధి గాంచు నబ్బాలుని శౌర్యంబుగాంచి పద్మాసురుని తలఁదన్ను వానిఁ దయారుచేసితిమని దేవతలు సంతోషపడుచుండిరి.

పద్మా:- (నవ్వి) ముగ్గురుమూర్తులే మూాలలకొదుగ ముక్కుపచ్చలారని యీా బాలునివలననా ముప్పువాటిల్లుట? ఈ వ్యర్థప్రలాపము లన్నియు సార్థకములని నిశ్చయించితివా?

నార:- సార్థకమో... నిరర్థకమో! ఎట్లుచెప్పగలను?

పద్మా:- అటులైన నిప్పుడే మదీయ సైన్యమునుబంపి కైలాసమును ముట్టడించి కుమారుని సంహరించునట్లు చేసెద.

సీ॥ ఆజ్ఞనిచ్చితినేని హాలాహలాగ్నిని
అఱచేతితోఁబట్టి యార్పఁగలరు
సెలవిత్తునేని వే చెలరేఁగి మున్నీట
ముగ్గురుమూర్తుల ముంచఁగలరు
శాసింతునేని దోస్సారంబు దీపింపఁ
బట్టి జీవుల పండఁగొట్టఁగలరు
పొమ్మందునేని నభోమార్గమున లేచి
పొంగి సూర్యుని దిగమ్రింగఁగలరు
గీ॥ చెలఁగి కొండలఁ దలక్రిందు సేయఁగలరు
బాలుఁడననెంత అవ్వాని బలమదెంత?
కొట్టి- యరదమునకు నంటఁగట్టి- నాదు
సన్నిధికిం జేర్పఁగలరు నిస్సంశయముగ.

నార:- తానుబోయినలేదు. తనపేరచీటి. (నవ్వును)

పద్మా:- ఆఁ! సర్వలోకభయంకరుఁడగు పద్మాసురునా యొక్క- బుడుతఁడు సంహరించుట? అసంభవము...ఐనను గోటితోఁబోవు దానికై గొడ్డలియేల? ఇప్పుడేపోయి వానివధింతు.

చ॥ చిఱుతని జూపకున్న శశిశేఖరుపేర్రివులు పోర్వులైపడన్
బెటికెద- రుద్రసైనికుల భీకరలీలవధించి పార్వతిన్
నటికెద- కొండనూపెదను- నందిని గిందినిబట్టి కుత్తుకన్
గోటికెద- ముజ్జగంబులను గొంకక చాపగఁ జుట్టిసైచెదన్.
[అని గదతోనిష్క్రమించును.]

నార:- మంచిది. పెంచినవాని తల త్రుంచుటకుఁ బ్రయత్నించుట! మంచి పరాభవము జరుగునుపొమ్ము. ఇఁక దేవాసురులకు జరుగఁబోవు యుద్ధము వర్ణనాతీతము.

ఉ॥ ఎన్నగనేల యిట్టి రణమెప్పుడుచూడము కొండకొండ డీ
కొన్నవిధంబునన్ విలయ ఘోషమొసంగఁగ వార్ధివార్ధి మా
ర్కొన్న తెఱంగునన్ జగము ఘూర్ణిలునట్లుగ దేవ దానవుల్
క్రన్నన మన్ను మిన్ననక క్రమ్మిన క్రోధముతోడఁ బోరరే.
[తెఱ]

# ద్వితీయ రంగము

స్థలము:—వాతాపి యిల్వలుల ఆశ్రమము.

[ఆకుటింటిముందు లేళ్ళు, ఆవుదూడలు పరుండి నెమరువేయుచుండును వాతాపి లేడిచర్మముపైన ఇల్వలుఁడు దర్భాసనముమీఁద కూర్చుండిగురుశిష్యులుగనటింతురు. తంబురమీటుచు తాళము వేయుచు తత్త్వము పాడుచుందురు.]

## —:గేయము - తత్త్వము:—

అఖిలజీవులకెల్ల— ఆధారభూతమగు
ఆత్మరూపముజూడు మనసా
ఆత్మరూపముజూచి— అందుకోగలిగితే
ఆనందమున్నదే మనసా ॥నీకు॥
ఆశలన్నియు తెగ్రెంచి— అఘములన్నియుతుగ్రెంచి
అచలసిద్ధినిపొందు మనసా
అచలసిద్ధినిపొంద— అఖిలమ్మునీవయ్యె
అలరుభాగ్యముగల్గు మనసా ॥నీకు॥
పరధనమ్మ్మనుజూచి— పరభామలనుజూచి
భ్రాంతిపొందకెనీవు మనసా
భ్రాంతిపొందితివేని— భ్రష్టమైతిరిగెదవు
పాటించునామాట మనసా ॥నీవు॥
మాయలోకముజోలి— మరచి నీలోనీవు
పాలసంద్రముచిలుకు మనసా
చిలికితేపగ్రతిచిన్కు— శివతత్త్వమైవెల్గు
వెల్గులోజేరవే మనసా ॥నీవు॥

వాతా:—ఓరీ! శిష్యా! ఋషులు—రాజర్షులు—బ్రహ్మర్షులు—మహర్షులు—దేవర్షులు—కులపతులు మొదలగు వారెవ్వరైన మన ఆశ్రమ ప్రాంతమునకు వచ్చుచున్నారేమో చూడరా.

ఇల్వ:— చూచుచున్నాను గురూ! అరుగో... మనకు కావలసినవారే వస్తున్నారు.

వాతా:-అగస్త్యుడేనా?

ఇల్వ:- ఔను.

వాతా:-ఐతేమహానిశ్చలమనస్సుతో తత్త్వముపాడవలెరా. కూర్చొ-

[పరధనమ్మునుజూచి-అనుచరణముపాడి ఆనందముతో మౌనము వహించినట్లుందురు]

అగస్త్యుడు:-(ప్రవేశించి) ఆహా! ఏమి వీరి నిర్మల తత్త్వజ్ఞానము. పండిన వేదాంతులవలె గనఁబడుచున్నారు. గురుశిష్యులు కాఁబోలు. ఇప్పుడిప్పుడు క్రొత్త ఆశ్రమములు మిక్కిలిగా వెలయుచున్నవి. మంచిది ఇట్టి ఆశ్రమముల ప్రోత్సహించుట నాకర్తవ్యము.

వాతా:-(వంగి నమస్కరించి) మహానుభావులు - మహాఋషులు- మా ఆశ్రమము పవిత్రమైనది. శిష్యా! వారిపాదములుకడిగి వల్కలముతో తడియొత్తి తాళవృంతముతో విసరుమురా.

ఇల్వ:- (తత్తరపాటుతో) చిత్తము. చిత్తము. ధన్యుఁడను. కృతార్థుఁడను. (విసరుచు నమస్కరించి) మంచి పాడియావులున్నవి- మార్గాయాసము తీరుటకు ఉష్ణధార లాస్వాదింతురాస్వామీ.

అగ:- అక్కఱలేదు. అంతకంటె మీ చల్లనివాక్కులే నాశ్రమను బోఁగొట్టుచున్నవి. ఆహా! ఏమి మీగురువు శాంతస్వభావము.

ఇల్వ:- ఔనుస్వామీ! వారు ఉపనిషదర్థవేత్తలు- మంత్రద్రష్టలు- ఆశ యేకోశమున లేనివారు- తలచుకొన్నచో మనబోటివారలను-(తప్పుతప్పు అనుచు చెంపలువేసికొనుచు) కాదుస్వామీ! మాబోటివారలను ఈమాయాలోకమునుండి పూర్తిగాతరింప చేయగలమహాత్ములు- పేరు సర్వాతీత సచ్చిదానంద పరమహంసావతంస స్వాములవారు- వచ్చినవారికెల్ల వేదాంతబోధ సేయుటయే వీరిపని.

వాతా:-మాశిష్యుని అతిశయోక్తులకేమిగాని-మీరెన్నడుదయసేయని వారు- మా ఆతిథ్యము దయతో స్వీకరింపవలెనని ప్రార్థన.

అగ:- నేను త్వరగా వెళ్ళవలయు. దక్షిణసముద్రతీరారణ్యమున ఋషులు సత్రయాగము చేయఁబోవుచున్నారట.

వాతా:-స్వామీ! ఇట్టియవకాశము మాకు లభింపదు. మీరీఆతిథ్యము తీసికొననిచో మేమిఁక నిరాహారదీక్షతో మరణింతుము.

అగ:- ఇంత భక్తిశ్రద్ధలతో ఆహ్వానించుచున్న మీ మాటను త్రోసి పుచ్చుటయు సమంజసముగాదు- కానిండు-

వాతా:-మహాప్రసాదము. ఓరీ! శిష్యా. స్వాములవారిని స్నానమునకు తీసికొనిపొమ్ము.

ఇల్వ:- చిత్తము. దయచేయుఁడుస్వామీ-(అగస్త్యునితో నిష్క్రమించుచున్నాఁడు)

వాతా:-మా పాచిక బాగాపాఱింది- అదుగో- ఇల్వలుఁడు సంతోషంగా వస్తున్నాఁడు-

ఇల్వ:- ఏసిన ఎత్తు గుఱ్ఱంగాసరిపోయిందిరా. ఆయన అనుష్ఠానము తీర్చుకునేసరికి చాలసేపుపడుతుందట.

వాతా:-ఈ పెద్దఘటము ఒరిగిందంటే మన మామగారు- పద్మాసుర మహారాజుగారు బలేబహుమతిఇచ్చి నెత్తినెక్కించుకుంటాడు.

ఇల్వ:- అయితే పిల్లనేమైనా ఇస్తాడురా?

వాతా:-నేను గట్టిగాచెప్పలేనుకాని, బెట్టుచేస్తే ఎలావుంటుందో! పడుచుపిల్ల మాంచి పాకంలో వుందిరా! చక్కనిచుక్క! అచ్చంగా రంభనోట్లోనుంచి ఊడిపడ్డట్లే ఉంది. "ఊ" అన్నాడా మనరొట్టెవిరిగినేతిలోపడ్డట్లే. ఈ ఉల్లాసంలో అసలు పనిమరచాం. లోపలకుపద- నేను మేకరూపం ధరిస్తాను- పని చకచక కానియ్-

ఇల్వ:- కనుమూసేసరికి ఐపోతుంది. పద (అనుచు నిష్క్రమింతురు)

[లోపల మేక అరుపు వినఁబడును]

ఇల్వ:- (ప్రవేశించి) అదుగో! సంధ్యావార్చుకుని అగస్త్యుడు వచ్చుచున్నాఁడు. లోనికి తీసికొనివెళ్ళి భోజనము తినిపించి తీసికొని వస్తాను. (నిష్క్రమణ)

అగ:- (ప్రవేశించి) భుక్తాయాస మధికముగానున్నది. బలవంతముగాఁ దినిపించుటచేఁ గాఁబోలు.

ఇల్వ:- (ఎదురుగావచ్చి మేదోజపించి) వాతాపీ! (అని అఱచును)
అగ:- (పొట్టలోఁగదలుచున్నట్లు గమనించి) జీర్ణజీర్ణం వాతాపిజీర్ణం (అనుచు పొట్టనిమురుకొని దివ్యదృష్టితో సత్యమెఱిఁగి దర్భ పోచలుతీసికొనిమంత్రించి) ఈ కుశప్రహారముచే ఇతఁడు మరణించుఁ గాక! (అనివేయు ఇల్వలుఁడు భయంకరముగఅఱచిచనిపోవును)

తెర

# తృతీయ రంగము - మహాకాళీ దృశ్యము

స్థలము—కైలాసగిరి

[కుమారస్వామి యుయ్యేలలో శయనించి యుండును పద్మాసురుఁడు ప్రవేశించి గదతోఁ గుమారుని గొట్టఁబోవ వివిధాయుధములతో భయంకరధ్వనితో మహాకాళి యడ్డుపడి పద్మాసురునిపై కుఱుకఁబోవును]

పద్మా:- (భయముతో) ఆఁ ఆఁ! భయంకరము... అతిభయంకరము కాళీ! మహాకాళీ! ఉత్క్షేపరక్తకపాలమాలీ! దీర్ఘదంష్ట్రాజాతసిత మయూఖాళీ! ఆయతనీలచికురపాళీ! దీపితభక్తహృత్పత్రితోళీ! భీకరసంహారకేళీ! నిలువుము...నిలువుము. ఈ లీల నేలవచ్చి తివి? అబ్బా! చూడఁజాల. కుమారుని రక్షింపవచ్చితివా? నీరూపముచూడఁజాల. దండగానున్న తలపుఱ్ఱెలు పండ్లికిలించు చున్నవియు, నల్లగుడ్లుతిరిగిపోవునవియు, రక్తముచిమ్ముచున్న వియు... ఆఁ! అసాధ్యము. అసాధ్యము. బాకులవంటి తెల్లని కోఱలనడుమ రక్తమయమగు నాలుక పాముపడగవలెఁ జాచినదే! అన్నిచేతులలోఁ జిత్రవిచిత్రములైన యాయుధ ములు వెలుఁగుచున్నవి ఘోరము, మహాఘోరము...... నాహస్తము వణఁకుచున్నదే! గద నిలచుటలేదే! కాళీ! కాళీ! చూడుము, నామాయాతంత్రప్రభావంబున నీకుఁజిక్కకుండఁ బోయి నిన్ను జయించుటకుఁ దగినయుపాయమాలోచించెద. (నిష్క్రమించును)




ఓమ్





# కుమారవిజయము



(కుమారస్వామి యుద్ధము)

## షష్ఠాంకము

### ప్రథమరంగము

స్థలము—పద్మాసురుని దర్బారు

[మంత్రులు, సామంతులు, శుక్రాచార్యుడు, సింహవక్త్రుడు, తారకుడు, భానుకోపుడు, ధర్మగోపుడు ఆసీనులైయుందురు. పద్మాసురుడు సింహాసన మలంకరించుటకు వచ్చుచుండ వందిమాగధులు స్తోత్రపాఠము సేయుదురు]

వంది:— జయము జయము. శ్రీమద్వీర మహేంద్రపుర సింహాసనాధీశ్వరా! సకలలోక సంచారధీరా! బ్రహ్మాండ దిక్కటాహ విదీర్ణ వర్ణనాతీతార్ణవ గంభీర సారక్ష్వేడాకరా! రాజాధిరాజ రమ్యమకుట రత్నద్యుతిచ్ఛటా నీరాజితపాదపంకజా! విజయీ భవ! దిగ్విజయీ భవ!

మాగధ:—ఖరాసి దర్శనమాత్రానంత భయభ్రాంత శరణాగతశాత్రవ పిశాచ కాలభైరవా! అవక్రపరాక్రమోపేత లబ్ధ భూచక్ర చంక్ర సంఘర్షితాహిత మత్తమాతంగ కంఠలుంఠనకంఠీరవా! విజయీ భవ! దిగ్విజయీ భవ!

శుక్రు:—దానవకుల తిలకా! నీవు పట్టినదెల్ల బంగారము ముట్టినదెల్ల ముత్యమగుటచే దేవతలకు మిక్కిలి కంటకముగానున్నది. కావుననే వాతాపిఇల్వల నగస్త్యునిచేఁ జంపించిరి. మఱియుఁ గైలాసగిరి వార్తలన్నియు నీకుఁ దెలియుచున్నవిగదా!

పద్మా:- తెలియ కేమి? ఇంద్రాదిదేవతలు కుమారుని శరణుజొచ్చి యాతని సేనా నాయకత్వమున మనల జయింపవలెనన యెత్తు లెత్తుచుండిరట.

శుక్రు:-గాలిచొరలేని తావునకైనఁ బోఁగల వేగుల వేఁగులుండ వైరుల మర్మ కర్మము లెఱుంగుటలో మనకు లోపముండదు. అమాయికులనణఁగఁద్రొక్కుటలో నమరులందె వేసిన చేతులు గాని మీవంటివారి నేమిసేయఁగలరు?

పద్మా:- బహువిధరాజకీయ తంత్రజ్ఞుఁడగు బృహస్పతి యటు రాజ గురువుగానుండ నేదియో పన్నాగము పన్నకుండునా?

గీ॥ కదనమున నెల్లజగములు కదలివచ్చి
డీకొనినఁగాని నన్ను నోడింపలేవు
ఎన్నివ్యూహములను బన్న నేమిలెక్క-
పట్టువిడువను నేన నీ పాదమాన.

ధర్మ:- సకల భువనేశ్వరా! కుమార వీరబాహుల కృత్యంబు లత్యంత భయంకరంబులు. కార్తికేయుఁడు కారణజన్ముఁడని త్రిమూర్తుల నిశ్చయమట.

శుక్రు:-కారణజన్ముఁడైనను నిష్కారణముగ మనతో యుద్ధమునకు సిద్ధపడునా?

ధర్మ:- సిద్ధపడిన మనమేగతి వర్తింపవలయునో దురూహ్యము.

తార:- మంత్రిగారినోట నెన్నఁడు విననిమాట వెలువడినదే. ధర్మగోపా! యెంతలో ధైర్యమును గోల్పోయితివయ్యా!

మ॥ శరజన్ముండన జంక నేల? యిపుడీ శస్త్రాస్త్రముల్ చూచు భీ
కరుఁడీ ద్వాస్థపతి-సింహవక్త్రుఁడు-మహాకాయుండు క్రౌంచుండు భా
సుర దివ్యాస్త్రుఁడు భానుకోపుఁడరరే శూరుల్ ఘనుల్ సైనికుల్
తురగ స్యందన కోట్లుగల్గు మనలన్ దూలింపగా శక్యమే?

సింహ:-(పరికించి) ఎక్కడిదారథము! మనోవేగమున వచ్చుచున్నదే. దానిచిహ్నములన్నియు శివసంబంధముగా నున్నవి.

ధర్మ:- దేవతలెవరినైనను రాయబారిగాఁ బంపిరా?

సింహ:- అగ్రజా! ఆగ్రహింపక యొక్క మనవి వినవేఁడెద. శుక్రాచార్యాదులుండ మీకు హితోపదేశము చేయఁదగినవాఁడను కాదుగాని విషమ విషయమును జ్ఞప్తికిఁదెచ్చెద. శంకరుఁడు వరమనుగ్రహించు సమయమునఁ దనలోనిశక్తి మాత్రమసాధ్యమనియె. ఆ శక్తియే యీ కుమారస్వామిగా జన్మించెనని నాయంతరాత్మ చెప్పుచున్నది. కావున, మంత్రిగారుసూచించినట్లు మనము దీర్ఘాలోచనసేయుట మంచిది.

తార:- (జనాంతికముగ) అన్నగారినోటనా యిటువంటి మాటలు. అలాత పిశాచన్యాయముగ నున్నదే.

పద్మా:- మంచిది. (సింహవక్త్రునిజూచి) ఐన నీ యభిప్రాయమేమి?

సింహ:- సవినయముగ సంధికొడంబడుట మేలని నా నిశ్చయము.

పద్మా:- ఛీ బుద్ధిహీనా! యేమని ప్రేలితివిరా? నిఖిల భువనాధినాథ మస్తక భాస్వద్రత్న మకుట చుంబిత పాదద్వయుండనైన నేనొక బాలునకు జంకి సంధిగావించుకొనవలయునా? కొండొక తూఁటి యీ మాట నోట రాసచ్చితివేని నిశిత కరవాలంబున నీ నాలుక ఖండించెద.

శుక్ర:- దానవేంద్రా! శాంతింపుము. నీ తమ్ముఁడగు సింహవక్త్రుఁడు నీ యనుయాయిగాని ఆతతాయిగాఁడు. ఇదియేదో విసపు గడియగా నున్నది. గుప్పిడి విడిపోయిన తిప్పలు తప్పవు. అదుగో! ఆ రథికుఁడిటే వచ్చుచున్నాఁడు.

[వీరబాహువు ప్రవేశించినంత నీశ్వరదత్తమైన దివ్యాసనమాకసము నుండివచ్చి యాతని వెనుకఁజేర దానిపైఁగూర్చుండును, అందఱునాశ్చర్య పడుదురు. ధర్మగోపుఁడు సింహవక్త్రుఁడు సాభిప్రాయముగ నొకరినొకరు చూచుకొందురు]

ధర్మ:- శివ భక్తాగ్రగణ్యులరగు మీ పేరడుగవచ్చునా?

వీర:- నా పేరు వీరబాహువు. నా స్వామి కుమారస్వామి. దేవదూతనై యిటకు వచ్చినాఁడను.

[గానలోలుఁడై నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు]

పద్మా:- మహర్షిచంద్రా! ఈ యాసనమలంకరింపుఁడు.

వీర:- (నారదుఁడు కూర్చుండ) దివ్యర్షి సమాగమము సంతోష దాయకము. శుక్రాచార్య ధర్మగోపాది జ్ఞాన వృద్ధులారా! సింహవక్త్ర తారక భానుకోపాది మహాయోధులారా! తక్కుఁగల సభాస్తారులారా! సావధాన చిత్తులరై కుమార స్వామియొద్దనుండి రాయబారిగావచ్చిన నాపల్కులువినుఁడు. వీరమహేంద్రపుర సార్వభౌమా!

ఉ॥ ఏలితివింతకాలము యథేచ్ఛగ లోకములెల్ల- నింద్రునిం
దోలితి-వెన్నరాని బహుదోషములంబొనరించి, తింక నీ
శీలము మార్చుకొమ్ము పరిశీలనతో- సురరాజు రాజుగాఁ
బాలన సేయనిమ్మసురపాలక! జాలి యొకింత పూనుమా!

మఱియు——

ఉ॥ ధర్మము తప్పఁగాఁదగదు దానవకోటికి దేవతాళికిన్
ధర్మమె శాశ్వతంబు నిజధర్మమె ముక్తిపథంబు చూడఁగా
ధర్మము తప్పినన్ యశము తప్పును, దప్పును భోగభాగ్యముల్
మర్మమదేల? కాయములు మాయును-మాయునుబంధుసేనలున్.

సురాసురవంశము లాదిలో నొక్కవృక్షమునఁ బూచిన రెండుపూవులు. ఒక వనమునఁబెఱిగిన రెండుప్రాణులు.

నార:- (జనాంతికముగ) ఒకగూటిలోఁబెఱిఁగినను కాకికాకే కోయిల కోయిలే!

వీర:- ఇదిగమనించి యమరావతీ పట్టణము నింద్రుఁడు వీరమహేంద్ర పట్టణమును నీవు పరిపాలించుట తగవని మాహితవు. కావున దేవతలకు సంబంధించినది పూరిపుల్లయైనను నీ వింక నుంచు కొనఁ దగదు.

పద్మా:- ఓహో! వీరబాహూ! మహోపదేశముచేసితివి.

ఉ॥ ధర్మముధర్మమంచు బహుధా వ్యథ పొందెదవేల? ఏది నీ
ధర్మము చెప్పుమా మును దైత్యులకిచ్చిరె స్వర్గమేలఁగా
ధార్మికులైన దేవతలు దాని నటుంచుట పక్షపాతపుం
ధర్మముగాక నీది యొకధర్మమె చాలిక గట్టిపెట్టుమా!

శుక్రు:- శౌర్యరసభాసురా! పద్మాసురా! మంచిసమాధానమిచ్చితివి. బుద్ధియందు బృహస్పతిని మించితివి.

వీర:- అసురాచార్యా! మీరే సురద్వేషమును బురికొల్పిన నిట మా మాటలఁ బాటించువారెవరు? బుద్ధియందు బృహస్పతిని మించఁగలవారు మీరు కావచ్చునేమోగాని యీ రాజెన్నఁడును గాఁడు. నారదా!

ఉ॥ నీతులనెత్తిచూపి యవినీతుల రూపుమాపి లోక వి
ఖ్యాతికి నోపి రాజగురుఁడై తగు శుక్రుఁడె పక్షపాతపుం
జేతముతోడ నాడ నికఁజెప్పెడిమాటల నొప్పుకొందురే
పాతకమెల్ల పండఁగనె భండనమొక్కటి రాక తక్కునే?

నార:- ఔనౌను ఈసు రోసములు పెనుబాములవలె బుసకొట్టుచున్నవి. తగిన నాగస్వరమూదఁగల యహితుండికుండు కావలెను. ఇంతకువిధి బలవత్తరము. ఐనను నా యెఱింగినంత చెప్పిచూచెద. పద్మ కోమలాకళత్రా!

చ॥ కొడుకులు తమ్ములుం గురులు కోరిన కృత్యములందు నండగా
నడచుచునుండ నాకు నొకనాఁటికినేనియు లోటువచ్చునే
జడమతులైన దేవతల సంధుల గిందులతోఁ బనేమి యం
చెడఁదఁ దలంపఁబోకు జయమెల్లపు డొక్కరిపక్షముండునే?

ఉ॥ సంధియొనర్చి యిర్వురకు సంతసముల్ సమకూర్పఁగా జగ
ద్బంధువు వీరబాహువు శుభంబుగ నేఁ డిటువచ్చె సత్కృపా
కంధి గిరీశుఁడంపఁ జెలికారపు సంధిభరంబు నీ భుజ
స్కంధముమీఁద నిల్చినది సర్వము గర్వముమాని పల్కుమా?

పద్మా:- ఋషీశ్వరా? మా యైశ్వర్యమునుమీరునుజూడఁజాలకుంటిరా?

శుక్రు:-అందాశ్చర్యమేమి? ఆతఁడు దైత్యఋషిగాఁడు. దేవఋషి.

నార:- నాకాబుద్ధిలేదు. ఉన్న చో నీ యాస్థానమునకు వత్తునా? మీ యోగక్షేమములు విచారింతునా?

ఉ॥ నీవును సర్వశాస్త్రములు నేర్చినవాఁడవు నీ గురుండు వి
ద్యా విభవాన్వితుం డొరులు ధర్మముచెప్పగలారె మీకు—మీ

భావము శాంతి భవ్యతల బంధురమై త్రిజగత్ప్రమోదమై
దీవనలందినం గలుగదే సుఖమెంతయుఁ గశ్యపాత్మజా!
ఇప్పుడు లోకమట్టుడికి నట్లుడుకుచున్నది.

సింహ:-ఎందులకు?

నార:- మీ స్వార్థమునకు——దేవతల కష్టములకు.

తార:- నీ లోతుపాతు లిప్పటికిఁ దేటతెల్లముగాఁ దెలిసినవి. దేవత లందఱు స్వార్థరహితులు. రాక్షసు లందఱు స్వార్థపరులు.

ఉ॥ మాయలమారి నారదునిమాటలు నమ్మఁగనేల యగ్రజా!
పాయుము వానిమైత్రి యని పల్కుఱుచెప్పిన నొప్పనైతి- వే
న్యాయమొ తెల్లమైనదె యథార్థముగా నిప్పుడైన నిట్టి య
న్యాయముఁ దెల్పునారు ఋషులా మనపాలిటి గర్భశత్రులా?
ఈతఁడు మనరహస్యము లెన్ని వైరుల కందిచ్చెనో! తేనెబూసినకత్తి.

నారదుఁడు:-

ఉ॥ కత్తెఱబోనుజిక్కినటుగా నిటనుంటిమటంచు తారకా!
మత్తిలిపల్కఁబోకు మవమానమసుమ్మది-చెట్టుగొట్టి మీ
కుత్తుకపైకిదెచ్చుకొను- క్రూరత తొల్తటినుండి యున్న దే
విత్తొకటైన చెట్టొకటి-వేఱుగ నెత్తఱినైనఁ బుట్టునే?

సింహ:-తమ్ముఁడా!ముందువెనుకలరయక తొందరపడవలదు. ఈఋషి మహామనీషి.

తార:- కావుననే యింతకాలము యుక్తితో నటించినాఁడు.

శుక్ర:- నారదా! రాక్షసులోడిపోయి యడవులలో నిడుమలు పడు నప్పుడు దేవతలకిట్టి నీతులెప్పుడైన బోధించితివా?

నార:- అవసరమని తోఁచినప్పు డెవరికైనను బోధించుటలగ్గు. ఇది మీకెగ్గుగా నున్నచో నిట నేనుంటఁ దగనిపని.

ఉ॥ వాద మిదేల మీరు పగవారివలెన్ మముజూచునప్పు డీ
బోధలు కర్ణశూలములపోలిక మీకు సహింపరానివౌ
పోదును-కర్మమేగతులఁ బొందఁగఁజేయునొ-పైత్యరోగికిం
జేదగుఁ బంచదార యనిచెప్పినఁ బెద్దలమాట వ్యర్థమా?

[లేచి పోఁబోవును]

మ॥ ఇటుసూర్యుండటు దోచినన్ వినను. నే నీమాట ముమ్మాటికిన్
పటుబాహాబల శక్తి చూపఁగల దేవవ్రాతమే యున్నచో
ఎటులేనిన్ మముగెల్చి పొందఁదగుఁగాదే మమ్ము సేవింపనౌ
అటుగాకొండొకమార్గముండఁ దగదీయార్భాటముల్ మానుమా.

తార:- అగ్రజా! అదియునుంగాక-

చ॥ కరులు రథంబు లశ్వములు కాల్బలముల్ కడు వేనవేలుగాఁ
బురహర సూనుఁడా నగరభూమికిఁ దోడ్కొనివచ్చి సంధికై
సరగునదూతనంప నతిశాంతము జూపుచు నొప్పుకొన్నచో
శరజునిరాకఁజూచి మదిజంకెను శూరుఁడటంచు నవ్వరే.

వీర:- సాధువు లెన్నఁడు నవ్వరు...నవ్వఁజాలరు.

చ॥ కరము భయంకరంబు- జనకంటక-మున్నత జీవహింసకా
కరము- పరార్థసంగ్రహము- క్షామము సన్నిహితంబు గాన సం
గరము మహాలయంబనుచు జ్ఞానులు దానికి నిచ్చగింతురే
పరమదయావిహీనులగు పాపులకే తృణమాత్ర మారయన్.

పద్మా:- ఐన మీరేల యుద్ధమునకు సిద్ధముగానుంటిరి? ఇట్టి శ్రీరంగ నీతులు మాకును దెలియును. దేవతలు రాక్షసులు ఆజన్మ విరోధులు. ఐనను నొక యొఱలో రెండుకత్తులిముడవు.

ఉ॥ వారలొ మేమొ లోకములు పాలనసేయుట యొప్పుగాని య
వ్వారలు మేమునుంగలిసి పాలనసేయుటకల్ల- వారితోఁ
బోరు ప్రసంగునా మరలఁ బూర్ణముగాఁ గసిదీర్చుకొందు మీ
తీరున మాటలాడకిఁకఁ దిన్నఁగ వచ్చినదారిఁ బట్టుమా!

వీర:- దోషాచర సార్వభౌమా! మృత్యువు నీ తలపైనెక్కి తాండవమాడుచున్నప్పు డెవరేమి సేయఁగలరు?

చ॥ వినయ వివేకశూన్యుఁడవు వేయివచింపఁగనేల యయ్యయో
తనయులు బంధువుల్ హితులు తమ్ములు మంత్రులుచత్తురన్న నీ
యునికి యొకింతమార్చి చెవి[illegible]గ్గవు తగ్గవు లోఁడు లేనిదే
చనదిల రాచపీనుఁగను సామెత యిత్తఱి ఋత్తపోవునే?

ఆచార్యా!

ఉ॥ ఎందఱు ఘోరపద్ములు మఱెందఱు తారక సింహవక్త్రు లిం
కెందఱు భానుకోప్రు లిఁక నెందఱు క్రౌంచులు ధర్మగోపులున్
వందలు వేలు లక్షలుగ వాహినులన్ గడియించివచ్చి మా
స్కందుని దాఁకి చత్తురు నిజంబు నిజంబిది దైత్యరాడ్గురూ!

భాను:- ఓయీ! నీ పిల్లిశాపముల కిట భీతిల్లువారు లేరు. జనకా!
ఆగ్రహంబుగల్గెనేని యుగ్రునైన నిగ్రహింపఁగల సోదరులుండ
గతజీవుల సజీవులుగఁ జేయంజాలు మహామంత్రవేత్తయగు
శుక్రాచార్యులుండ మనకా యపజయము? ఇంతయేల?

చ॥ సెలవిడిపంపినం దివిజసేనలతోడ గుహుండువచ్చినం
దొలఁగక జుట్టుపట్టుకొని తోడ్కొనిరాఁగల సూనుఁడుండఁగాఁ
గలఁగకుఁడింక - తెడ్డుకలుగంగను జేతిని గాల్చుకొందురే
విలయ సమీరఘోరహతి వ్రీలవె సాలము లొక్కపెట్టునన్.

తార:- సెబాస్! పులిపిల్ల పిల్లికిజంకునా?

వీర:- యౌవనబలంబున నేల పిచ్చిమాటలాడెదరు?

ఉ॥ మారుఁడు దైత్యహంతక కుమారుఁడు ధీరుఁడు మారమార ధీ
హారుఁడు రౌప్య భూధరవిహారుఁడు నిర్జరకోటిసైన్య సం
భారుఁడు గౌరి గంగల కుమారుఁడు భీకరశక్తి శక్తి దు
ర్వారుఁడు ధాతృదుర్మద నివారుఁడు మీకు శరణ్యుడారయన్.

తార:- మా వైరులఁజేరినవాఁడు మాకు శరణ్యుఁడా? కాఁడు. పరమ
శత్రువు. దేవదానవ సార్వభౌమా!

ఉ॥ ఆజ్ఞనిడన్ సురాసురులనైన వడంకఁగఁజేయునట్టి నా
ప్రజ్ఞఁదలంపరేమి- పసిపాపఁడు మొన్నజనించినట్టి స
ర్వజ్ఞతనూజుశీర్షమున వంగనిక్రొమ్ములు వచ్చియున్నవే
ప్రాజ్ఞులు దీనికై యదురుపాటు వహింతురె తేల్చిచెప్పుమా!

వీర:- ఓయీ తారకా! అజ్ఞానాంధకారమునఁ గన్నుగానవుసుమా!

ఉ॥ బాలుఁడు సర్వలోకపరిపాలుఁడు సంతతధర్మచింతనా
శీలుఁడు- నిత్య సత్యపరిశీలుఁడు- కిల్బిష శుష్కతాటవీ

పద్మా:- మహాత్మా! చిన్నవానిపల్కుల కింత పెద్దకోపమా? సురసామ్రా జ్యము మాకుఁ బరాక్రమమున లభించినదిగాని దానధర్మ ముగ వచ్చినదిగాదు.

వీర:- మునీంద్రా! ధర్మనిర్ణయము చేయలేనివాఁడు లేచిపోఁదగుం గాని మీ రేలపోవలయు? నే వచ్చినపని పూర్తిగాఁదెల్పునంత వఱకైన నిల్పుఁడు. అసురవరులారా! మీరు వరబలమున విజృంభించి ధర్మపరివర్తనలేక దివాకర నిశాకరులు దిక్పాల కులు పూజనీయులని గ్రహింపక పాదపూజఁ జేయించు కొనుచు దేవతల నెందఱనో చెఱయందుంచితిరట. వారి నీ క్షణము విడిచిపెట్టుఁడు. ఎవరి యధికారము వారికొసంగుఁడు కాదేని మీకును మాకును యుద్ధముసిద్ధము. అందువిజయము మాకు సిద్ధాంతమని యీశ్వరపుత్రుండగు కుమారస్వామి మీతో ముమ్మాటికిఁ జెప్పుమనె.

పద్మా:- ఒక్క యీశ్వరపుత్రుఁడేగాదు. ముగ్గురుమూర్తుల పుత్రులు వచ్చినను లెక్కసేయము.

శా॥ ఏమో సంధికివచ్చినాఁడవని నే నీ కొల్వుకూటంబునన్
స్వామీ! రమ్మట స్వాగతంబనుచు నీ సంభాషణం బెంతయో
యామోదించెదనంచు నీదు మదిలో నాశించితే యెన్నఁడున్
మోమోటంబుగ మాటలాడము సుమీ ముక్కంటియేవచ్చినన్.

వీర:- ఇందు మోమోటంబుగ మాటలాడవలసిన విషయములేదు. నేనువచ్చినది క్షేమముగోరికాని మీ స్వాగతముకోరి కాదు. నవాధిక లక్ష ప్రమథగణముతో చతురంగబలముతో మహా తేజస్వియగు కుమారస్వామి శ్రీ సంధినగరమునకువచ్చినాఁడు. కాని, ధర్మమాలోచించి నన్ను సంధికిఁబంపినాఁడు. నీవును శివభక్తితత్పరుఁడవు శాంతముగ యోచింపుము. పోరు నష్టము పొందు లాభమని గ్రహించి సంధికి సమ్మతింపుము.

పద్మా:- ఓ దేవదూతా!

కీలుఁడు- విశ్వరూప పరికీర్ణవిలోలుఁడు- పాఱఁజూడు భూ
పాలక! అట్టివాఁడు పసిపాపఁడనన్ మదిఁజోద్యమయ్యెడిన్.

భాను:- తండ్రీ! నిజముగా సంధిఁగోరువాఁడైన సమరసన్నాహకుఁడై రానేల? ఇంద్రునకు శరణ్యుఁడై మనలనేమేమో చేసెదనని బయలుదేరియుండవచ్చు. ఈఁగఱెక్కలగాలికి కొండలూఁగ వని గ్రహించి యా దురహంకారి సంధికుదిరిన మాటలతోఁ గార్యసిద్ధియగునని యీతనిని బంపియుండవచ్చు. ముందు వీనినిబట్టి చెఱసాలలోనికి నెట్టినచో అన్నిసంధులు నప్పుడే తేలఁగలవు.

శా॥ జాలింబూనితిరో ప్రశాంతమతులై సంధింపఁగా వచ్చినాఁ
డేలీలం జెనకంగఁ జూతుమనుచెంతే నాత్మజింతింతురో
కాలాతీతమదేల చూడుమిదె ఱెక్కల్ వెన్కకుంగట్టి యీ
నీలస్తంభము కంటగట్టెదను దండ్రీ! యాజ్ఞనిప్పింపుమా!

నార:- (జనాంతికముగ) నూఱు కాకులలో నొక కోయిల.

వీర:- (చిఱునగవుతో) భానుకోపా! నన్నుబంధింప మీకుఁగాదు గదా మీ తాతముత్తాతలకైనను దరముగాదు నన్నుదూషించినఁ బడియుందునుగాని పరమాత్మస్వరూపుండగు కుమార స్వామిని నిందించిన నే నూరకుండను. అప్పైనిమహాప్రళయము సంభవించును. దాన మీ వంశవృక్ష మామూలాగ్రముగ నశించును. లోకములఁ గబళించితిమిగదాయని గర్వపడకుఁడు.

ఉ॥ గాలపు మాంసలేశమునుగాంచి మహాభ్రమ మీను చంగునం
దాలిమితోడ మ్రింగుతఱి దానిముదంబునుజెప్ప శక్యమే
జాలరి పిమ్మటన్ వెలికి సంతసమొప్పఁగ లాఁగిపట్టి యా
గాలము కంఠసీమను బెకల్చుతఱింగద తుళ్ళడంగుటల్.

తార:- చాలుఁజాలు. నీ తెలివి నిచ్చటఁదెలియఁజేయ నవసరము లేదు. ఇఁక దయసేయుము. ఇంతవఱకు నిన్ను పేక్షించుట నీయదృష్ట మనుకొనుము.

పద్మా:- ఇటనుండి మఱలిపోయెడి వార్త లేదేమో!

వీర:- నీయట్టివాని కతంబుననా?

ఉ॥ ఎట్టి ప్రదోషవేళ జనియించితివో భువిపైన రాజ! నీ
యట్టి వివేకహీనుఁడెవఁడైనను గల్గునె? దేవతాళినిం
గొట్టిన- స్త్రీలనెందఱినో ఘోషిలుచుండఁగఁ బట్టియుం జెఱం
బెట్టిన పాప మీ వనుభవింపక తీఱున బుద్ధిమాఱునా?

క్రౌంచ:-ఓరీ దూతా! నీ నీతులిఁకఁ గట్టిపెట్టుము. మా రాజేంద్రుని నోట నీకుందగుహితవచనములు విన నెంచుట పులినోట పురాణ ధర్మములు వినఁ దలఁప్పించుట. ఈ సభాస్థలమున మమ్మిట్టు తూలనాడిన వారెవ్వరులేరు. ముందున్న చెవులకంటె వెనుక వచ్చిన కొమ్ములు పైకిలేచినవి. రాజా! దండప్రయోగమున కాజ్ఞనిత్తురా?

సింహ:-ఛీ పాపీ! రాయబారిని గొట్టెదవురా! ఇదిగో! మదీయ గదా దండమును చూడుము.

క్రౌంచ:-ఆఁ రమ్ము. నీక్రొవ్వడగించెద (తారకుండు ఇరువురనువారించును)

వీర:- నీ పాపఫలమేరీతిగా పరిణమించినదో చూచితివా? నీ సభాస్థలము రణరంగమైనది. మీలో మీరు కొట్టుకొని చచ్చు కాలము వచ్చినది. ఇప్పుడైన యోచింపుము. దేవతల విడిపింపుము నానుడువులాలింపుము. కాదేని కొలఁదికాలములోఁ గాలుని లీలలు గాంచఁగలవు.

తార:- దురాత్మా! మా యెట్టయెదుట బ్రహ్మేంద్రాద్యమరులు సైతము నిలువఁజాలరు. ఏమిరా నీ ప్రగల్భములు! అగ్రజా! ముందు వీనిని జెఱసాలలోనికి నెట్టి యాపైని వీనింబంపిన దుర్మార్గుని పనిబట్టుదమా?

వీర:-

మ॥ కలుషాత్మా! ననుఁబట్ట సాధ్యమగునా కైలాసవాసాత్మజుం
జలసంబేమియులేని భక్తినెదపూజల్ సేయువాఁడంజుమీ
బలునిం స్కందుని విశ్వరూపుని మహాభ్రాజిష్ణునిం జిష్ణునిం
బలుకాకీ! యిటులేలపల్కెదవు నీ పాండిత్యముం నిల్పుమా!

పద్మా:- భటులారా! (బంధింపుఁడని సైగచేయఁబోవ)
భటులు:-ప్రభూ! ఏమి సెలవు!
సింహా:-అగ్రజా! (వద్దని సైగచేయును)
వీర:- ఇదియే మీకుఁజెప్పు కడపటి వాక్యము.
ఉ॥ ఒక్కముమీఁదఁ గుక్కుటము తీవిగనొప్ప గుహుండు తేజిపై
నెక్కి శరప్రకాండము లహీనముగాగురిపింప దిక్కులున్
బిక్కటిలంగ నీ బలము పీనుఁగులైపడువేళ సంధికై
యుక్కఱి మ్రొక్కి మొత్తుకొన నొక్కరు నీ పలుకాలకింతు రే.
[పద్మాసురుఁడు సైగచేయ బంధించుటకు భటులు రాఁబోవ వీరబాహువుగ్రహించును]
వీర:- సర్వశక్తిసంపన్నుఁడైన సర్వేశ్వరుఁడు నా వెన్నునఁగాచికొని యుండెనేని నే నిటనుండి వెళ్ళువఱకు ఈ భటు లట్లే నిలిచి యుందురుగాక! (అడుగువేయుచు లోనికిఁజూచి) సారథీ! రథముఁ ద్రిప్పుము. (నిష్క్రమణము)
నార:- చూచితివా ఆ మహాభక్తుని మహిమ!
శా॥ ఆలుంబిడ్డలతోడ బంధువులతో నాహ్లాదముంబొందు నీ
వేలా ఘోర లయంబుఁ దెచ్చికొనెదో యీ సంధి పాటింపకే
చాలుంజాలిఁకఁ బోయివచ్చెద రణోత్సాహంబు దీపింపఁగాఁ
దాలుంగట్టియుఁ దేలిపోవు విధివ్రాఁతల్ దాఁటఁగావచ్చునే?
[గానలోలుఁడై నిష్క్రమించుచున్నాఁడు]
ధర్మ:- మహారాజులు సర్వసైన్యాధిపతి నీ సభాస్థలమందే నిర్ణయింపఁదగు. (పూలదండఁదెచ్చి పద్మాసురున కిచ్చును)
పద్మా:-(మాలతో తారకుని సమీపించి)
చ॥ హరినదలించి మించిన బలాఢ్యుఁడవై దిశలేలు నాయకుల్
శరణనివేడఁ జేసిన ప్రచండ గదాధర! యిట్టియుద్ధమం
దరిజయ సైన్యనాయకుఁడవై మనపూర్వులకీర్తి నిల్పి సం
గరమున వైరులన్ జిదిమి క్రమ్మఱ నీ విటరమ్ము తమ్ముఁడా!
[తారకుని మెడలోఁ బూలమాల వేయును. కరతాళధ్వనులు]
సేవ:- (రక్తసిక్తాంగుఁడై సంభ్రమముతోఁ బ్రవేశించి) సార్వభౌమా! సార్వభౌమా!

పద్మా:- ఏమది?

సేవ:- ఆపద... గొప్ప ఆపద. కుమారస్వామి భక్తుఁడు శాస్త్రి మీ సోదరి భుజమునరకెను.

పద్మా:- ఆఁ! ఆఁ! (కనులెఱ్ఱఁజేయును)

సేవ:- మీ మేనల్లురగు వాతాపి యిల్వల అగస్త్యుఁడు చంపెనట. కసిదీర్చుకొనఁబోయిన మాకీవిధముగ శాస్త్రి జరిగినది.

(నమస్కరించి నిష్క్రమించును)

పద్మా:- వింటిరిగదా కుమారి కృత్యము. ఇఁకసత్వరముగ మీరందఱు యుద్ధసన్నద్ధులరై రండు.

[సింహవక్త్రుఁడుతప్ప తక్కినవారు నిష్క్రమింతురు]

సింహ:-శుభమస్తనఁగనే రక్తదర్శనము. సమయమును గమనించి వర్తించునేర్పు మాయన్నయెడసున్న. వలదని తొలఁగితినా అగ్రజాపకారినని స్వామిద్రోహిననికులమెల్లపోయును. మాట మాయును. ఇంతకు నారదుఁడు చెప్పినట్లు విధి అలంఘ్యము.

ఉ॥ వచ్చెదువాఁడు స్కందుఁడట వానికి దక్షిణబాహువట్లుగా
వచ్చెదువాఁడు వీరుడఁట వహ్నికి వాయువుతోడు సూపిన
ట్లిచ్చకొలంది రేఁగఁగలరేరికి సాధ్యము వారిఁదాఁక మా
పుచ్చెల నూడదీయుటకె పుట్టిన దీపెడబుద్ధి; మాఱునే.

(నిష్క్రమించుచున్నాఁడు)

తెర






ఓమ్





# కుమారవిజయము

(కుమారస్వామి యుద్ధము)



## సప్తమాంకము

### ప్రథమరంగము

స్థలము—యుద్ధభూమి

[కుమార వీరబాహువులు సాయుధహస్తులై ప్రవేశించుచున్నారు]

కుమార:—

మ॥ కరవాలంబును జేతఁబట్టి ఘన సంగ్రామస్థలిందూఁకి భీ
కర నృత్యంబులుసల్పి వైరిశిరముల్ ఖండించి తత్కాయముల్
ధరపైవ్రాలఁగ వానిపై నరుగుచుం దచ్ఛిర్షముల్ బంతుల
ట్లరయన్ ఖేచరలీలఁగ్రాల ననిలో నత్యుగ్రతంజూపెదన్.

వీరబాహూ! నీ శౌర్య ధైర్యసాహసములు మెచ్చుకొనఁ దగినవి. పద్మాసురుని పుత్రులందఱు వధింపఁబడిరా?

వీర:— లేదుప్రభూ! ఇరువురుమాత్రము మిగిలియుండిరి. పెద్దవాఁడగు భానుకోపుడు మరల రణమునకుఁ దారక క్రౌంచులతో వచ్చుచున్నాఁడు

కుమా:—మంచిది. తారకునే రానిమ్ము.

చ॥ అలిగినతారకున్ బలిమి నాహవభూమిచిబట్టి దిట్టమా
నలుగులుగుచ్చివచ్చి వెస నంపెదఁ ప్రేతపురంముసేర నే
నలిగినభానుకోపుఁడిఁక నంబులబాధకు వీఁక నిల్చినన్
నలుగు మహాస్త్ర శస్త్రముల నా ఘనదోర్బల విక్రమంబునన్.

నీవాదెసకేగి మనసేనలకుత్సాహము గలిగింపుము.

వీర:- చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు)

[ఈ క్రింది పద్యము జదువుచుఁ దారకుఁడు ప్రవేశించుచున్నాఁడు]

తార:- ఓరీ నిర్జరపక్షపాతీ!

ఉ॥ చిక్కితి వెందుఁబోఁగలవు చెచ్చెఱ వచ్చుచునుంటి నెత్తురుం
గ్రక్కఁగఁదన్ని నీశిరముఖండనచేసి మదీయ శౌర్యముల్
బెక్కుగఁ జాటువాఁడనిదె భీకరమౌ గదఁ జూచినాఁడవే?
నిక్కెడవేల నిర్జరులు నిన్నిలఁబెద్దగఁజేసి పంపినన్.

కుమా:-నిర్జరులుగాదురా ధర్మదేవత పెద్దగఁజేసిపంపినది.

చ॥ బవరముచేసి నాకులను బాధలఁబెట్టితివంచు మించి యీ
భువనములెల్లఁ దల్లడిలఁ బొంగకు మీ క్షణమిందె భంగమౌ
దివి భువి నీదుచావునకు దేవుని బ్రార్థనచేసినంత నీ
శివతనయుండు నిన్నిపుడు చీల్పగఁ జివ్వకువచ్చె నిల్వుమా!

తార:- (వికటముగ నవ్వి) పిట్టకొంచెము. కూఁతఘనము.

ఉ॥ నిల్చెద సంగరస్థలిని నిర్జరకోటులు బెగ్గడిల్లఁగాఁ
బిల్చెద నాదుసైనికుల భీకర యుద్ధ కళాకలాపులన్
గెల్చెద నీదు యోధులను గేలియొనర్చెద పిల్కుమార్చెదన్
జీల్చెద నీదువక్షమును సేనయుఁదీరఁగఁబీల్తు రక్తమున్.
రమ్మిఁక జయమ్మెవరిసొమ్మో తేలఁగలదు.

[కుమార తారకులు యుద్ధముచేయుచుండ క్రౌంచుఁడువచ్చి కుమారునితోఁ దలపడును. తారక క్రౌంచులు వెనుకంజవేయుచు లోనికేగుదురు]

కుమా:-(పరికించి) ఓహో! ఎంతమోసము. కామరూపులగు వీరెంత మాయాస్పదులు! తారక క్రౌంచులు వీరబాహుని మోస గింపఁదలఁచి క్రౌంచుఁ డీ పర్వతరూపము దాల్చియుండ తారకుఁడద్దాని గుహాంప్రవేశింప నా మిత్రుఁడు వానివెంట నేగె. అంధకారబంధురమగు గుహామధ్యమున వీరునిబంధించి వధించుటకై యీ పన్నుగడఁ బన్నినారు. ఈ క్షణంబ వీరి మాయలన్నియుఁ బ్రళయవాయు సన్నిధి శరన్మేఘమువలె

వమ్మైపోవుఁగాక! తొలుతఁ బర్వతరూపధారియగు క్రౌంచా
సురుని పసిపట్టెద.

[నిష్క్రమించి మరలఁబ్రవేశింపఁగాఁ బర్వతము, దానిగుహ కనఁబడును; పర్వతమును బల్లెముతోఁబొడువఁ బెద్దమ్రోఁతతోఁ బగులును. క్రౌంచుఁడు నిజరూపముదాల్చి క్రిందఁబడి చనిపోవును]

(రక్తసిక్తాంగుఁడై తారకుఁడు ప్రవేశించుచున్నాఁడు)

తార:- మదీయ... ఖడ్గ... ఘా...తంబున...... నీ శిరంబు...
వ్రయ్యలు చేసెద...చూడుము.

[కుమార తారకుల యుద్ధము తారకుఁడు నేలఁగూలును]

కుమా:-అబ్బా! ఇప్పటికి శూరపద్మునకుఁ గుడిభుజము పోయినట్లే.

తెఱలో స్వామీ! సింహవక్త్రుఁడు మనసేనలచించిచెండాడు
చున్నాఁడు.

కుమా:-భయమువలదు. ఆదెసకేవచ్చుచుంటి. (నిష్క్రమణ)

సింహ:-(ప్రవేశించుచు)

శా॥ ఘోరాస్త్రంబునుజేతఁబట్టి జగముల్ ఘూర్ణిల్లఁ గ్రోధైక సం
చారప్రక్రియఁ జాటినాఁడనసుచుక్ సంతోషముంబొందకే
నా రాకక్ మదినెంచుమా అరయుమా! నానాస్త్రవిధ్వంసినై
సారాచార విచార ధీరసరణిక్ సాధింతు మిమ్మెల్లరక్.

కుమా:-(ప్రవేశించి) ఓయీ సింహవక్త్రా! ఏల యజ్ఞానాంధకార
మగ్నమానసుండనై నాతో సమరముచేయ సాహసింతువు?
తొలఁగిపొమ్ము.

సింహ:-ఆలముచేయ పాఱిలుమాలి యీ నేలందొలంగిపోవుటకు బేల
ననుకొంటివా? వాలు బట్టితినేని కాల కాలునైన రణకేళిం
దూలింపఁగల బలశాలినని యెఱుంగుము. పట్టినపట్టువీడక నీ
దండును గుట్టలుగుట్టలుగా మట్టువెట్టఁగలజెట్టిని నేనే.

కుమా:-నీవు జ్ఞానవతుఁడవేని నా మాటలలోని సత్యమును గమ
నింపుము. ఇప్పటికైన నామాటనుబాటించి సంధికిసమ్మతించిన
పద్మాసురునకు మేలగు. ఒక్కక్షణము కన్నులుమూసికొనుము
నా విశ్వరూపము గనిపించఁగలదు.

సింహా:-(నిమీలితనేత్రుఁడై) స్వామీ! మీ మహిమ గ్రహించితిని. నేనొక్కండ నేమిసేయుదు? నా యన్న నా మాట వినఁడు. మాకు మీచేత చావుసిద్ధము. కానఁ గదనమును సాఁగించి నాకుఁ గైలాసమొసంగుఁడు.

కుమా:-మంచిది. అట్లేయొసంగెద:

[యుద్ధము సేయ సింహవక్త్రుఁడు పడిపోవును]

## [తె ర]

[మఱలఁ దెఱ నెత్తఁగా క్రిందిపద్యముజదువుచుఁ బ్రవేశించుచున్నాఁడు పద్మాసురుఁడు]

పద్మా:- గీ॥ అమరులకుఁ బూర్వ సౌఖ్యములందఁజేయ
నీదుతరమౌనె నే నింక నిలిచియుండ
గదను చేఁబూని వచ్చితిఁ గదనమునకు
నిలిచిపోరుము నా తోడ నీచ చరిత.

కుమా:-(దెఱలోనుండి) ఓరీ సురారీ!

ఉ॥ వచ్చెద వాఁగఁబోకు తులువా! పరిపక్వముచెందెఁ బాపముల్
చచ్చెదవింక నీ పొగరు సాఁగదు శూలితనూజు చెంగటన్
బొచ్చము లేదు రమ్ము తినఁబోవుచునే రుచి నెంచనేల? ఓ
తుచ్ఛ! త్వదీయరక్తమును దోసిట నర్ఘ్యమునిత్తుఁ గాళికిన్.

నీ వనుభవింపవలసిన పాప ఫలము మహామేరువువోలెఁ బెఱిగియున్నది. నీ వెంత శూరశిఖామణి వైనను దైవ సహాయంబులేని నీ దౌర్జన్యము పనిసేయునా? నా జనకుని కరుణచే నింతటి మహోన్నతపదవినంది మన్ను మిన్నుగానక లోకంబులను చూడఁజాలని బాధలఁజిక్కఁజేయుటచే వారిపై నక్కటికంబున ముక్కంటియే మీ వధకై నన్నుసృజించె. అందులకు నిదర్శనంబుగ నీ మహాయుద్ధంబున మా దివ్యవాహినులు మీ సైన్యంబుల మృత్యుప్రవాహమున ముంచె. నీ సోదరు లింతకు ముందే యమ దంష్ట్రికలంజిక్కినారు. కొమ్మలు తెగిన మ్రానువోలె నీ వొక్కండవు మిగిలియుంటివి. మంచిని యోచించి నాతో వైరము వాటింపకుము.

పద్మా:- అటులైన రెండు పల్కులకుఁ బ్రత్యుత్తర మొసంగెదవా?
కుమా:-నిస్సంశయముగ.
పద్మా:- దేవదానవులు సోదరులేగదా!
కుమా:-అవును కశ్యపసంబంధమున.
పద్మా:- అందు జ్యేష్ఠభార్యకు జనించిన దైత్యులకు రాజ్యాధికారము లేకుండఁజేసిన దుర్మార్గులెవరు?
కుమా:-తొలుత రాజ్యాధికారము దైత్యులదే. ఐనను వారు క్రూర కృత్యంబులవలన బదభ్రష్టులైరి. పిదప నింద్రుడు నూఱు యజ్ఞములుచేసి యమర సింహాసనాధికారము పొందెను.
పద్మా:- నూఱు కాదు. వేయి యజ్ఞములుచేసినను జ్యేష్ఠాధికారము కనిష్ఠునకే కలుగునా? పెద్దకొడుకుపెత్తనము పెన్నలోఁ గలిసి నట్లేనా? ఇఁక నీ వెన్ని చెప్పినను నమ్మను. మా అన్నదమ్ముల తగవులలో నిష్కారణముగ జోక్యము కలుగఁజేసికొని అందొక పక్షముజేరుట మీకుఁ బరిపాటియైనది. ఐనను—

సీ॥ బాల్యచాపల్య సంబద్ధుఁడవై మించి
బంధింప ముదుసలి బ్రహ్మకాఁడు
నీ వేషమునకుబ్బి నీవె దైవంబని
భక్తిగొల్వఁగ వీరబాహు కాఁడు
నీ పిచ్చిమాటలు నిజమని మది నమ్మి
శరణువేడఁగ సురేశ్వరుఁడు కాఁడు
ప్రాణభీతిని జెంది ప్రభునితో బాటు నీ
జయముగోరఁగ బృహస్పతియు గాఁడు
గీ॥ ఘోర దుర్వార సంగర క్రోధజనిత
రోష కాలాగ్నికీలల భీషణాహతి
యక్ష గంధర్వ కిన్నర శిక్షకుండు
శూర మత్తేభ సింహంబు శూరుఁడితఁడె!

కుమా:-ఓహో! శ్రుతిమించి రాగము. నీ నెత్తుట జొత్తిల్లిన నాకత్తి గాంగజలంబులతోఁ గడిగి కైలాసంబున కరిగెద.

ఉ॥ క్రొవ్వున జివ్వకుం గదిసి కో! యని దూకిన వైరిశీర్షముల్
గవ్వలగుత్తులట్టుపడఁ గాండ పరంపరలీలఁజూపు న
న్నివ్విధి డాసినన్ మిడుత లింగలముంబడురీతి కాదొకో!
అవ్వలతో వసంతమని యాగితి నింతకు సంశయించుచున్.

పద్మా:- అవ్వలో అవ్వాయిచువ్వలో అయిదు నిమిషములలోఁ దేలఁ గలదు. ఇదిగో! సకలలోకభయంకరమగు పాశుపతాస్త్రంబు వదలుచున్నాను. (వెనుకకుఁబోయి వదలును)

కుమా:- ఔరా! ఏమిదీనిమహిమ! అసాధ్యమగు నీ పాశుపతాస్త్రము నుండి తప్పించుకొనుటెట్లు? విల్లుగూడ విరిగినదే! సర్వలోకములు దహించువిధమున నగ్నిజ్వాలలు భయంకరముగ నష్టదిక్కులఁ గ్రమ్ముచున్నవే. తాపము... తాపము...మానసమా! దుర్బలత్వమును జెందుచుంటివా? మఱవకు...... నే నిప్పుడెచటనుంటిని? కైలాసమా?... అగ్నికుండమా?... కాదు. ఇది యుద్ధభూమి. భవానీ! పాహిమామ్.

## దండకము

శ్రీమన్మహాదేవి చౌడేశ్వరీ శాంకరీ లోకమాతా జయోపేత నేతా భవానీ మృడానీ సదా భక్తరక్షా కళాధీన దీనావనా పాపసంహార ధీరా శుభాకార వందారు బృందారకానంద సంధాన మందార నీ దివ్యపాదార విందంబులన్ నాదు డెందంబునన్ భక్తితో నిల్పి సేవించువాడన్ గటాక్షంబు నాపైఁ బ్రసాదింపవే శక్తినిప్పింపవే నీదు పుత్రుండనౌ నన్నుఁగావంగ రావే పరాశక్తి రుద్రాణి శర్వాణి కాత్యాయనీ గౌరి బ్రహ్మాండముల్ సృష్టిగావింపఁ బోషింప నాశంబు గావింప నీవేగదా శక్తిసంపన్న వౌ నిత్యకళ్యాణి దుర్గా నమస్తే నమస్తే నమః.

[పైనుండి ఖడ్గము శక్తి వచ్చుచుండును]

**తెఱలో**- నీ తండ్రిసంబంధమగు నయ్యస్త్రమునకు నమస్కరించుము. అది శాంతించును. రాక్షసునిపై నీశక్తిని బ్రయోగింపుము.

కుమా:-(శక్తిని గ్రహించి) కృతార్థుఁడను. జననీ! మహాకాళీ!

మ॥ అధికారంబును గల్గి యుంటిమని ధర్మాధర్మములల్ చూడకే
మదమెక్కఁగ గను గానలేక కడు దుర్మార్గమ్మునంజొచ్చి యీ
ప్రధనంబుఁగ సమకూర్చె వీని విడువఁగ భావ్యంబె నీ వింక నా
బుధవైరిం గని మాయచేయనెటకుం బోనీక బంధింపుమా.

(నిష్క్రమించును)

[గదాహస్తుఁడై రక్తసిక్తాంగుఁడై పద్మాసురుఁడు ప్రవేశము]

పద్మా:- ధర్మయుద్ధంబున వీనినిజయించుట యసాధ్యము. నాతల్లివలనఁ బొందిన మాయాస్వరూప దృగగోచర విద్యచే వీనికన్నులకుఁ గనపడకుండ జంపవలయు. (పోఁ బోవ శూలముతో తీవ్రదృష్టితో శంకరుఁడు ప్రవేశము) ఓ హా! చిత్రము ...విచిత్రము... మృత్యుంజయుఁడా! ఈశానుఁడా!...ఆఁ! అదిగో అగ్ని నేత్రము... పినాకము... త్రిశూలము... నాకు వర ప్రదాతయే నా ప్రాణఘాతమునకుఁ బ్రయత్నించునా? ఛీ! యేమి యీ యశుభవాక్కు. మఱియొక దెస కేగెద.

[పోఁబోవ కరాళవదనము తెఱచి యఱచుచు కాళికాశక్తి యడ్డుపడుచు]

కాళీ! మరల వచ్చితివా?... పుత్రప్రేమ... కానిమ్ము...
నిన్నెదుర్కొనవలసిన యవసరము నాకు లేదు పొమ్ము.

[వేఱొకదిక్కునకుఁ బోఁబోవ చక్రధరుఁడై విష్ణువు ప్రవేశించుచున్నాఁడు]

అరెరే! విష్ణు! నాతమ్ముని బారికి నిలువఁజాలక చీకాకైనవిష్ణు! ఇప్పుడు వీరాధివీరుఁడై యడ్డగించినాఁడు .. ఆహా! కాల మహిమ. నాడు వక్రంబైన చక్రము సక్రమంబుగఁ గన్పట్టుచున్నదే! మాయకాఁడా! సమయము తప్పినది. మఱియొక సారి నీ పనిపట్టెద.

[ఇంకొక దెసకుఁ బోఁబోవ బ్రహ్మ ప్రవేశించుచున్నాఁడు]

ఓహో! తాతగారు...తలయు గడ్డము పండిన తాతగారు... బ్రహ్మ... ఆచార్యులవారుపదేశించిన జాలవిద్య ఇప్పుడక్కఱకు వచ్చునట్లు లేదే! చూచెద.

[మఱియొకదెసకుఁ బోఁబోవ వజ్రాయుధమును మెఱపించుచు
నిందుృఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ఆఁ! ఆఁ! గౌతముని పంచకోడి!... వేయికన్నులుగల వీరుఁడు
...పలుమారులు మా వంగడమునకోడి డాగిన వీరుఁడు...
ఛీ! నీ మొగము చూడరాదు... తొలఁగుము... ఆఁ! వజ్రా
యుధమును ఝళిపించుచుంటివా!... కాలము మాఱినప్పుడు
కఱ్ఱ గొఱ్ఱెయై కఱచును. (అడుగిడఁబోయితూలి) ఆఁ! ఏమిది?
నా శక్తియంతయు నే మహాశక్తి చేతనో హరింపఁబడుచున్నది.
నా యంతరాత్మ యేదియో జ్ఞానోపదేశము చేయుచున్నది.
నేసుచేసిన [illegible]కృత్యము లన్నియు నన్నీరూపమునఁ జుట్టు
ముట్టుచున్నవి! (ప్రక్కలఁ జూచి) ఇదియంతయు కుమారుని
జాల విద్యయా... తెలిసికొంటిని... దురాత్ముఁడగు వాఁడె
క్కడ? పట్టి చీల్చెద...నెత్తురుపీల్చెద ప్రేవులు తాల్చెద...

[తెఱలో]

కుమా:- ఓరీ! క్రూరా! (ఈ క్రింది పద్యాంతముతోఁ బ్రవేశము)

శా॥ భక్తిన్ మజ్జననిన్ భజింపఁదగఁ బ్రాప్తంబై సురానీక మా
సక్తింగాంచెడిదై త్వదీయబల భాస్వద్ఘోర సైన్యాళులన్
ముక్తప్రాణులఁజేసి నీ కొఱకునై పొల్పొందుఁబెనృక్తి ఈ
శక్తిన్ నీ యసువుల్ హరించి ఘన దోశ్శక్తిం బ్రదర్శించెదన్.

[ఇరువురు యుద్ధముచేయుదురు. పద్మాసురుని బొమ్మపై కుమారుఁడు కూర్చుండి
శక్తితోఁబొడువఁబోవ నొకప్రక్కనుండి శంకరుఁడు వేఱొకప్రక్కనుండి
నారదుఁడు ప్రవేశించుచున్నారు]

బద్మా:- (హీనస్వరమున) స్వామీ! నీ శక్తి గ్రహించితి. నన్నుఁగ్ర
హించి నీ వాహనముగఁ జేసికొమ్ము.

శంక:- కుమారా! ఆగుము. నీవలె నితఁడును గారణజన్ముఁడు. కాని,
క్రూరత్వము వీరత్వమునకుఁ గళంకముఁగూర్చినది. సింహావ
లోకనమున పశ్చాత్తప్తుఁడై కన్నీటితో కళంకము కడిగికొని,
తన చరిత్రకు శాశ్వతత్వముఁ గల్పించుకొన నిన్నీకోరిక కోరి
నాఁడు. అంగీకరింపుము. నెలమివాహనముగనుండి నిన్ను
నిరంతరము సేవిక చుచుండును.

కుమా:-చిత్తము (పద్మాసురుని భూమ్మిపైనుండి లేచును)

పద్మా:- మహాప్రసాదము. (నమస్కరించును)

(క్షణములో పద్మాసురుఁడు నెమిలిగామాఱును)

శంక:- కుమారా! మహావిజయసూచకంబుగా ఇప్పుడే మయూర వాహనుండవుకమ్ము.( నెమిలిపై నెక్కి కుమారుఁడు శంకరునకు నమస్కరించుచుండ ఇంద్రుడు కుమారుని పుష్పమాలాలంకృతునిగా జేయుయును)

నార:- ధన్యులము.

చ॥ జయము జయంబు మా కొమరుసామికి దిగ్విజయంబు సత్కళా
శ్రియులగు దేవతాళికిఁ బ్రశాంతశుభంబగు లోకపాళికిన్
నయవినయాది సద్గుణగణంబుల రాజిలు భక్తకోటికిన్
జయమగు సర్వజీవులిఁక సంతసమందుచు సౌఖ్యమందగా.

శంక:- తథాస్తు.

మంగళం మహత్.

తె అ

